# కథాసూక్తులు - సుధామూర్తులు



రచన

**డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి,** M.Sc., M.Phil., Ph.D.

(రిటైర్డ్) రీడర్ & భౌతిక శాస్త్ర విభాగాధ్యక్షులు
టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరు




**జగద్గురు పీఠము - గుంటూరు శాఖ**
(The World Teacher Trust - Guntur Branch)
గుంటూరు - 522 002
ఫోన్ : 233995

# కథాసూక్తులు - సుధామూర్తులు

ప్రథమ ముద్రణ, 2001 సెప్టెంబర్



ప్రతులకు

1. **ది వరల్డ్ టీచర్ ట్రస్ట్**

   **H/o. డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి**

   5-10-4, 2/9, బ్రాడీపేట

   గుంటూరు - 522 002

   ఫోన్ నెం. (0863) 233995

2. **ది వరల్డ్ టీచర్ ట్రస్ట్**

   45-40-36/1

   అక్కయ్య పాలెం

   విశాఖపట్టణము - 530 016

   ఫోన్ నెం. (0891) 565291.

## వెల : రు.25/-

ముద్రణ : విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్,

గుంటూరు -2, ఫోన్ : 242345

# విషయసూచిక



## కథాసూక్తులు

## సుధామూర్తులు

# ముందుమాట

ఈ చిన్న పుస్తకంలో పదమూడు కథలు, తొమ్మిది వ్యాసాలు ఉన్నాయి. ఇవి ఇంతకు పూర్వం 'నావాణి' మాసపత్రికల్లో ప్రచురింపబడ్డాయి. అప్పుడు ఈ కథలన్నీ – 'గురు కథా సుధాలహరి' అనే శీర్షికతో ధారావాహికంగా ప్రచురింపబడ్డాయి. ఎందుకంటే – వీటిలోని ఎక్కువ కథలు మా గురువు గారైన శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు తమ ప్రసంగాల్లో అప్పుడప్పుడు చెప్పినవే ! అయితే మాస్టారు చెప్పిన కథాఇతివృత్తాన్ని మాత్రమే తీసి కొని, ఏమార్పులుచేస్తే ఇంకా బాగా కథమలుపులు తిరిగి పాఠకులకు నచ్చుతుందో అలా మార్చి – హాస్యస్ఫోరకమైన భాష, సంభాషణాదులతో ఈ కథలను వ్రాయడం జరిగింది. ఇప్పుడు క్రొత్తగా ప్రతి కథాంతంలో ఆ కథనుండి సారంగా గ్రహించగలిగే సూక్తులు గూడా జతపరచబడ్డాయి. ఈ సూక్తులన్నీ ఆధ్యాత్మిక మార్గానికి దోహదపడతాయి. నిత్య జీవన యోగ సాధనకు చేయూతనిస్తాయి. ఇలా సూక్తులతో కూర్పు చేయబడిన ఈ కథలకు "కథాసూక్తులు" అనే శీర్షికను నిర్ణయించడం జరిగింది. ఈ కథలు ఏఏ 'నావాణి' మాసపత్రికలలో ప్రచురింపబడింది విషయసూచికలో తెలుపబడింది.

ఇక 'సుధామూర్తులు' అన్నశీర్షిక గురించి. ఈ శీర్షికకు చెందిన తొమ్మిది వ్యాసాలుగూడా పూర్వం నావాణి మాసపత్రికల్లో ప్రచురింపబడ్డాయి. ఈ వ్యాసాలను నావాణికి వ్రాయమని మాస్టారే నన్ను ప్రోత్సహించి ఆశీర్వదించారు. అయితే అప్పుడు ఈ వ్యాసాలన్నీ "ఆంధ్రమణిమాల" అన్న శీర్షికతో ధారావాహికంగా ప్రచురింపబడ్డాయి. ఇప్పుడు ఈ వ్యాసాలకు

"సుధామూర్తులు" అనే శీర్షిక పెట్టబడింది. 'సుధా' అంటే 'అమృతం' అని అర్థం. 'సుధామూర్తులంటే' అమృత మూర్తులు' అని అర్థం వస్తుంది. ఈ వ్యాసా వ్రాయబడిన వారు దేహత్యాగం చేసి చాలారోజులైనా తెలుగు వారి హృదయాల్లో చిరకాలం స్థిరంగా గుర్తుండి నిలిచి పోయే వారు కాబట్టి – 'అమృతమూర్తులే' ! 'సుధా' అన్నపదానికి, – 'సు' – అంటే 'చక్కగా', 'ధా' అంటే 'ధారణ చెయ్యవలసిన' అంటే – 'గుర్తు పెట్టుకోవలసిన' అనే అర్థాలు గూడా వస్తాయి గాబట్టి 'సుధామూర్తులు' అన్న పదాలకు 'చక్కగా గుర్తుపెట్టుకోవలసిన మహానుభావులు' అనే అర్థం ఈ శీర్షికకు వస్తుంది.

ఈ పుస్తకానికి 'కథాసూక్తులు – సుధామూర్తులు' అనే ఉమ్మడి శీర్షికను నిర్ధారించడంలో ఒక విధమైన అనుప్రాసతో కూడిన శబ్దాలంకార శోభ గూడా ఈ శీర్షిక సంతరించుకుంది. ఈ కథలను వ్యాసాలను చదివిన మాస్టారు ఆనాడు నన్ను అభినందించకుండా ఉండలేక పోయారు. ప్రస్తుతం జగద్గురు పీఠం అంతర్జాతీయ గౌరవాధ్యక్షులైన డా.కంభంపాటి పార్వతీ కుమార్ గారు కూడా ఆ రోజుల్లో ఆ కథలను చదివి – "మీ కథలు మంచి 'రిలీఫ్' నిస్తున్నాయి" అని అన్నట్లు గుర్తు. క్రొత్త వారు ఎలాగూ ఈ కథలను చదువుతారు. పూర్వమే నావాణిలో చదివిన పాఠక సోదరులు గూడా మళ్లీ చదివి ఆనందించమని నా మనవి. పిల్లలకూ యువతకు గూడా ఈ కథలు వ్యాసాలు బాగా ఉపకరిస్తాయి నచ్చుతాయి అని నా నమ్మకం.

ఇట్లు
జి.ఎల్.ఎన్.శాస్త్రి

గుంటూరు
2.9.2001

# కృతజ్ఞతలు

ఈ పుస్తకంలోని కథలకు ఇతివృత్తాన్ని, వ్యాసాలకు ప్రోత్సాహాన్ని ఇచ్చి ఆనాడే చదివి ఆశీర్వదించి, ఆనందించిన మా గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారికి భక్తిపూర్వక హృదయాంజలులు.

పుస్తకంలోని కథలు, వ్యాసాలు సంపూర్ణంగా చదివి ఎంతో ప్రేమతో 'గాథాసుధలు' అనే శీర్షికతో తన అమూల్యమైన అభిప్రాయాన్ని అందజేసిన మాన్యమిత్రులు శ్రీ మన్నవ గిరిధరరావుగారికి, పుస్తకముద్రణకు యథాశక్తి ఆర్థికసహాయం చేసిన శ్రీ ఆర్.వి.బి. రామలింగేశ్వరరావు గారికి నా తరపున, మా జగద్గురుపీఠం – గుంటూరు శాఖ తరపున నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఇందులోని కథలు, వ్యాసాలు ఎప్పుడెప్పుడు నావాణి మాసపత్రికలో ప్రచురింపబడినదీ వివరాలను అందజేయడంలో సహకరించిన– చి॥ సత్తిబాబు, చి॥ కె.శివశంకర్‌లకు –

కథలకు, వ్యాసాలకు సంబంధించిన వ్రాతప్రతిని చక్కని ముత్యాలవంటి అక్షరాలతో వ్రాసి సిద్ధపరచిన బి.సుదర్శనశర్మ గారికి–

DTP చేసి ఇచ్చిన చి॥సౌ॥ ఇందిరకు, చక్కగా ముద్రించి ఇచ్చిన విజయసాయి ఆఫ్‌సెట్ ముద్రణాలయము వారికి–

ముఖపత్రాన్ని అందంగా, ఆకర్షణీయంగా తీసుకురావడంలో సహకరించిన చి॥ఎమ్.వి.రమణకుమార్‌కు –

పుస్తకరూపంలో ప్రచురించడానికి అనుమతి నిచ్చిన WTT వైజాగ్ వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు

**జి.ఎల్.ఎన్.శాస్త్రి**

గుంటూరు

29.9.2001

# గాథాసుధలు

- మన్నవ గిరిధరరావు
Ex.M.L.C.

డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి గారు నా చిరకాల మిత్రులు. భౌతిక శాస్త్ర పరిశోధకులు. ఆధ్యాత్మిక విద్యాపారంగతులు. సంస్కృతాంధ్ర సాహిత్యాలను ఆకళింపు చేసుకున్నవారు.

సగటు మనిషికి కూర్చోడానికి తీరిక లేదు. పట్టుమని పది ఉద్గ్రంథాలను చదివే ఓపిక లేదు. అవతల టెలివిజన్ ఛానల్స్, ఇంటర్నెట్లూ పాశాలు వేసి లాగుతుంటాయి, ఇవతల - కార్లూ, రైళ్లూ పరుగిడుతుంటాయి - నడుమ మన ఉపదేశాలను వినిపించుకొనదెవరు ?

అందుచేతనో ఏమో శాస్త్రిగారు సరిక్రొత్త విధానం చేపట్టారు. అంతగా బుర్ర పగుల కొట్టుకోనవసరం లేకుండా, కేవలం పేజీలు తిరుగవేస్తే చాలు, కొన్ని వేదాంతసూక్ష్మాలు, సాహిత్యసౌకుమార్యాలు వంటపట్టేవిధంగా "కథాసూక్తులు - సుధామూర్తులు" పుస్తకాన్ని వెలువరించారు.

భగవంతుణ్ణి ఆకాశం నుండి లాక్కొచ్చి గడపలో నిలబెట్టారు. ఆయనను మనలో ఒకణ్ణిగా చేశారు. మూడు నాలుగు పేజీలలో మన బాధల్ని ఏకరువు పెట్టారు. పొడుపుకథను విప్పినట్లుగా ఆయనచేత అంతర్నాటక మాడించారు.

"నీ దర్శనమైతేచాలు అన్నికోరికలూ తీరిపోవాలి. నువ్వు ప్రత్యక్షం అయినతర్వాతగూడా నాకు ఇంకా కోరిక అనేది మిగిలివున్నదంటే - అసలు నీవు దేవుడవే కావు".

"మన దగ్గర నామమాత్రంగా స్వీకరించి, అంతకు ఎన్నో రెట్లు తిరిగి ప్రతిఫలంగా ఇచ్చేవాడే భగవంతుడు".

"తీర్చగల సామర్థ్యం వుండికూడా బాకీతీర్చకుండా వెధవ్వేషాలు వేస్తే – చెవులు పిండి మరీ వసూలు చేసి 'బాలెన్స్‌షీట్' వేసేవాడే భగవంతుడు" అంటారు రచయిత.

అన్నిటిలోకీ 'ఆత్మ సమర్పణ' కథ బహు రమణీయంగా వుంది. ఒక యువకుడు ఆత్మవిద్య గ్రహించడానికై ఒక గరువు దగ్గరకు పోయాడు. ఆ గురువు ఇతనికొక పరీక్ష పెడతాడు. లోకంలోకల్లా విలువలేని వస్తువును తెమ్మని అడుగుతాడు.

అతడు తేవడానికి పోతాడు. ఎదురుగా ఒక ఆవు వస్తున్నది, మనిషి కెంటె పశువు విలువ లేనిది గదా అనుకొని ఆవును తీసికెళదామనుకుంటాడు.

ఆవు అతన్ని ప్రశ్నిస్తుంది. రోజూ తాను పాలిస్తుంటే వాటితో కాఫీలు టీలు చేసుకొని త్రాగుతున్నావు. నేను పనికి మాలిన దానినా అని అంటుంది.

సరేనని ఆవును వదలివేసి గడ్డిపోచను తీసుకుంటాడు. దాన్ని అంతా పనికిమాలినదానిగా చెబుతారు. కనుక దాన్ని తీసుకు పోవాలనుకుంటాడు.

"నన్ను తినబట్టేగదా ఆవు నీకు పాలనిస్తోంది ? నేను పనికి రానిదాన్నయినానా ?" అని ప్రశ్నిస్తుంది.

సరే, దాన్ని వదలివేస్తాడు. గడ్డిమేసి ఆవు పేడను విసర్జిస్తున్నది గదా. అదే పనికిరానిదని దాన్ని తీసుకుపోదలుస్తాడు.

"నన్ను పొలాలకు ఎరువుగా వేసి మీరు పంటలు పండించుకోవడం లేదూ ? పిడకలకు, విభూతికి నేనే కావాలి. నేను పనికిరానిదాననా ? అని పేడ అడుగుతుంది.

ఆవుపేడ విలువైనదే. పశువులమలం విలువైనదే. కాని, మనిషి మలానికి విలువలేదు. దాన్ని పట్టుకెళ్తాను అనుకుంటాడు.

"నీ మలాన్నే నేను. నన్ను విలువ లేనిదాన్నిగా జమకడుతున్నావు. నీవు డబ్బులుపెట్టికొన్న చక్రపొంగలి, బాదంహల్వానే ! నీ పొట్టలోపడి ఇలా తయారైనాను. ఇప్పుడు చెప్పు విలువలేని వాళ్లం నీవా నేనా ?" అని అన్నది.

"నిజమే. ప్రపంచంలోకల్లా నేనే విలువలేనివాణ్ణిగా కనపడుతున్నాను. నన్ను నేనే సమర్పించుకుంటాను గురువుకు" అని ఆత్మసమర్పణ గావించుకుంటాడు !

నీ డబ్బు, నీ అందం, నీ అధికారం, నీ ఆస్తి ఇవేవీ కావు నాక్కావలసింది. నువ్వు నిన్ను సమర్పించుకుంటే నిన్ను నన్నుగా తీర్చిదిద్దుతాననేవాడే నిజమైన గురువు !

ఇలాగే 'హై టెక్‌రామకోటి' మరొక ఆసక్తికరమైన కథ.

ఒక వ్యాపారికి ఆర్థికంగా బలపడటానికి రామకోటి వ్రాయమని ఒక జ్యోతిష్యుడు సలహాయిచ్చాడు.

ఆ వ్యాపారికి తీరికలేనందునే రామకోటి త్వరత్వరగా పూర్తిచేయడానికి జీతంయిచ్చి గుమాస్తాలను పెట్టుకుంటాడు. వాళ్లు, కార్బన్ కాపీలు పెట్టి, స్టెన్సిల్‌తో కాపీలు తీసి, రోజుకు 50 వేలు, లక్షారామకోటి పూర్తిచేస్తారు.

ఆ వ్యాపారికి ఇళ్లూ వాకిళ్లూ బదులుగా పిల్లలాడుకొనే ప్లాస్టిక్ మేడలూ, మిద్దెలూ వస్తాయి ఫలితంగా.

మోక్ష ధర్మంలో బాధ్యతలను తప్పించుకోవడం, మన బాధ్యతలను మరొకరికి బదిలీ చేయడం పనికిరాదని అంటారు రచయిత.

"సుధామూర్తులు" శీర్షికతో తొమ్మిదిమంది మరువరాని ఆంధ్రులను పరిచయం చేశారు. వీటిలో గూడా ఆశ్చర్యంగొలిపే సంగతులున్నాయి.

కాశీనాథుని నాగేశ్వరరావుగారి దాతృత్వము అపారమైనది. వారి స్వగ్రామమైన ఎలకుర్రులో రెండెకరాల భూమిలో నాలుగు దూలాల ఇళ్ళు తన స్వంతఖర్చుతో 40 కట్టించి హరిజనులకు ఉచితంగా ఇచ్చారు.

బ్రహ్మనాయుని గురించి మనం ఎందుకు విస్తృతప్రచారం చేయ లేదో మరి. ఆయన తెలుగునాడులోకాక మరి ఎచ్చట పుట్టినను విశ్వ విఖ్యాతి గడించేవాడు. 'కన్నమదాసు' అనే హరిజన బాలకుణ్ణి తన పుత్రుడుగా స్వీకరించాడు. మాచెర్ల చెన్నకేశవస్వామి ఆలయంలో హరిజన ప్రవేశము చేయించి, 'చాపకూడు' అను పేర పంక్తిభోజనం పెట్టించాడు. క్రీస్తు, బుద్ధుడులాంటి అవతారపురుషులకోవకు చెందినవాడు బ్రహ్మనాయుడు!

ఇలా కుతూహలం కలిగించే విషయాలలో ఈ పుస్తకం పాఠకుల నాకర్షిస్తుంది. డా. శాస్త్రి గారి ప్రయత్నం సఫలమవుతుందని వేరే చెప్పనవసరం లేదు.

గుంటూరు
24.9.2001

ఇట్లు
**మన్నవ గిరిధరరావు**

# అంకితం



మాస్టర్ EK గారు సూచించిన ఆధ్యాత్మిక మార్గాన్ని తు.చ. తప్పకుండా అనుసరించినవాడు, ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ, ఎంతోమంది సోదర సోదరీమణులకు తన సహాయ సహకారానందిస్తూ, సలహాలనిచ్చి ఆనంద పరచిన వాడు, జగద్గురు పీఠం గుంటూరుశాఖ నిర్వహించే ఉచిత హోమియో వైద్యాలయ నిర్వహణ, గ్రంథ ప్రచురణ, గురుపూజామహోత్సవాది విషయాలలో అహర్నిశలు శ్రమించి, తలలోనాలుకలాగా వ్యవహరించి - ఒక పరిపూర్ణ యోగ సాధకునిలా అందరి హృదయాలలో సుస్థిరంగా నిలిచిన- ఆత్మీయ సోదరుడు

**సూరవరాజు హనుమాన్ ప్రసాద్‌ను**

సంస్మరిస్తూ ఈ చిన్నపుస్తకాన్ని జగద్గురుపీఠం గుంటూరుశాఖ సోదర సోదరీమణులందరూ కలసి అతనికే అంకితం ఇచ్చుకుంటున్నాము.

గుంటూరు
29.9.2001

ఇట్లు
జి. ఎల్. ఎన్. శాస్త్రి

# పాపం .... లక్ష్మీదేవి !

"తాతగారూ ! మీరు గానీ, బామ్మగారు గానీ పూనుకోకపోతే లాభం లేదు. అవతల కొంపలంటుకు పోయేలా ఉంది. వ్యవహారం శ్రుతిమించింది. ఆ పైన మీ ఇష్టం".

"ఏం నాయనా ! నారదా, మళ్ళీ ఏమొచ్చింది ? ఇప్పుడే గదా అలా కుజలోకానికి వెళ్ళొచ్చి కాళ్ళు కడుక్కున్నది ! ఇంతలోనే మళ్ళా ఉత్పాతమా?" అన్నాడు విష్ణుమూర్తి.

"ఈసారి కుజలోకం కాదు. భూలోకం. భూలోకంలో ఎవరో నలుగురు ఉన్నట్లుండి తపస్సు ప్రారంభించారు"

"పోన్లెద్దూ, వాళ్ళే మానేస్తారు కడుపు మాడితే. ఇలాంటి వెన్ని చూడలేదు ?"

"అని వదిలేస్తే తీరిపోయే వ్యవహారం కాదు. పెద్ద పట్టే పట్టారు. వదిలేటట్లు లేరు, ఏదో తేలందే !"

"దేని కోసమై ఉంటుందబ్బా ? ....... ఆ....... తెలిసింది ! ఇది నా వల్ల అయ్యే పని కాదు. చూడు లక్ష్మీ ! వాళ్ళు నీ కోసం తపస్సు చేస్తున్నారు. ఒక్క అడుగు అటేసి వస్తావా ?"

"వెళ్ళమనటమూ మీరే, తీరా వెళ్ళొచ్చిన తరువాత ఎక్కే గుమ్మం, దిగేగుమ్మం, పాపం తీరిక లేదు అనటమూ మీరే, ఇంతకూ నిజంగా

వెళ్ళమంటారా తేల్చి చెప్పండి. అవతల నాకు బోలెడు పనుంది". అంది లక్ష్మి దేవి.

"వెంటనే వచ్చేస్తానని మాటివ్వు"

"అలాగే."

* * *

నాయనా ! నేను! లక్ష్మిని, వచ్చేశాను కళ్ళు తెరు.

"..........."

"ఒరేయ్ నాయనా ! భక్తా! నీ తపస్సుకు మెచ్చాను. తపస్సు పండింది."

"అయితే నేనడిగింది ఇవ్వగలవా?"

అందుకే గదా నాయనా వచ్చింది అడుగు నీకేం కావాలో"

"తల్లీ ఒక పెసరట్టు ప్రసాదించు"

"ఇంకేమీ అక్కర్లేదా?"

"అక్కర్లేదు తల్లీ! నాకోర్కె తీర్చు"

"నాయనా! నేను ఎవరో తెలుసునా ? సాక్షాత్తు లక్ష్మిని. వైకుంఠం నుండి దిగి వచ్చాను నీ కోసం. నా తాహతుకు తగ్గట్లు ఏదైనా పెద్ద కోరిక కోరుకో".

"నాకు కావలసింది పెసరట్టు. మా ఆవిడను చేసి పెట్టమంటే పెట్టలేదు. ఇంతకూ నువ్వు ప్రసాదించగలవా? లేవా?"

"ఏది అడిగినా ఇవ్వగలను. ఏదైనా భారీ ఎత్తున కోరుకో. వైకుంఠం నుండి భూలోకం దాకా వెళ్ళి ఏమి ప్రసాదించి వచ్చావు అని ఎవరైనా అడిగితే నాకే నామోషీగా ఉంటుంది".

".........."

"అంత కోపం దేనికి నాయనా ! అలాగే తీసుకో. నీ కుడి ప్రక్కన ప్లేటులో కొబ్బరి చెట్నీ, అల్లం చెట్నీతో సహా పెసరట్టు ఉన్నది చూసుకో, మరి వెళ్ళొస్తా, అవతల మరొక భక్తుడు వేచి ఉన్నాడు".

* * *

"విన్నావుగా నాయనా ఆ మొదటి వాడు కోరింది?"

"అవును తల్లీ ! లక్ష్మి దేవి ప్రత్యక్షమైతే చవకబారు కోరిక కోరేడు చవట"

"నువ్వు చక్కగా పుష్కలంగా కోరుకో"

"కోరనూ! దుర్లభమైన ఈ అవకాశం జారవిడుచు కుంటానా? నాకు ఒక బస్తా పెసలు ఇప్పించు".

"అంతేనా"

" అంతేనా అంటావా? బస్తా పెసలతో ఎన్ని పెసరట్లు వస్తాయో ? నీకేం లెక్క తెలిసినట్లు లేదు"

"తెలియక కాదు నాయనా! ఇంకా పెద్ద కోరిక కోరలేవా?"

"నేనేగాదు. ఆలెక్కకు వస్తే ఎవ్వడూ కోరలేడు - ఇంత కన్న ఘనంగా"

"అదిగో! పెసలబస్తా నీ పక్కన ఉన్నది. మోసుకొనిపో ! అవతల నాకు ఇంకో భక్తుడున్నాడు".

* * *

"ఏమిటలా చూస్తున్నావ్? వీడు గూడా అంతంత మాత్రంగానే కోరుకున్నాడనేనా ?"

"అవును తల్లీ! వీడు ఏదో ఉద్ధరించినట్లు మొదటి వాడిని పరిహసించాడు. వీడు మాత్రం వరగబెట్టిందేమిటి ? బస్తా పెసలు ఏమంత ఎక్కువ? అదీ గాక తింటూ ఉంటే తరిగిపోవా? తరుగని ఐశ్వర్యం కోరాలి, నీవు దర్శనం ఇచ్చినపుడు"

"మరినువ్వుకోరు వాళ్ళకి బుద్ధివచ్చేటట్టు".

"ఓ ఎకరం పొలం ఇప్పించు. పెసరచేను వేసుకుంటాను. ఏటేటా కావలసినన్ని పెసలు! నేను తినగా, మిగిలిన వాటితో వ్యాపారం పెట్టి డబ్బు గడిస్తాను"

"ఇంకేమైనా పెద్ద కోరిక కోరలేవా"?

"ఇంత కంటే ఎవడు మాత్రం కోరగలడు? ఊరికే ఊరించక ఇప్పించు నా ఎకరం పొలం".

"అదిగో!నీ ఎడమ వైపు ఉన్న పొలం నీదే ! ఇక ముందు ఎవ్వరూ నీ కడ్డురారు. శిస్తు కూడా నిన్నెవరూ అడగరు. నేనే కట్టు కుంటాను. సరేనా! మరి అవతల భక్తుడున్నాడు వెళ్ళాలి".

* * *

"నీవు కూడా కోరుకో నాయనా. వెంటనే నా పని పూర్తి చేసి వైకుంఠానికి పోతాను."

"నేను ఇదివరకు వాళ్ళలా కాదు. ఇదంతా కొత్త పంథా. మనం కోరేది ఎవ్వరూ కోరి ఉండరు, మరి నీయిష్టం".

"మొగమాట పడకు. ఎంత పెద్ద వరం కోరితే అంత సంతోషం నాకు".

"అయితే కాసుకో, తీరా కోరినాక అది తప్పు, ఇది తప్పు అన్నావంటే లాభం లేదు. నీ మీద నమ్మకం లేక కాదు గాని ముందు కొంత వ్యవహారం అవసరం, ముందు మాట గట్టిచెయ్యి".

"మాట గట్టే! తప్పక ఇస్తాను కోరు".

"అయితే విను. నువ్వు ఇలా ఉన్నపళంగా మాఇంటికి వచ్చి మా ఇంట్లో ఉండిపో ! నాకు కావలసినపుడు నిన్ను ఆడుగుతూ ఉంటాను, వరాలు ఇస్తూ ఉందువు గాని".

"ఓరిగడుగ్గాయి! నువ్వు నిజంగా గట్టివాడివే. ఆ! సరే అలాగే గాని. ఉండు ఉండు అవతల ఇంకెవడో ఉన్నట్లున్నాడు. పాపం! ఆఒక్కడి కోర్కెకూడ తీర్చి నీ యింటికి వచ్చేస్తాను. నువ్వు గూడా నాతోరా".

* * *

" తల్లీ జగజ్జననీ ! నేడెంత సుదినం. నీ దర్శనం అయింది. నా జన్మచరితార్థమయింది. చాలు!"

" మరి నువ్వు కూడా వరం కోరు. సంతోషిస్తాను".

"నీ దర్శనం కన్న ఇంకవరమేమి కావాలి తల్లీ!"

"అలా కాదు నాయనా మీరు వరాలు కోరటం, మేము ఇవ్వటం ఆచారం".

"నువ్వే కనిపించాక ఈ ఆచారాలతో ఇంకేమి పని ?

"కాదు నాయనా ఎంతో దూరం నుండి వచ్చాను. వరం యివ్వ కుండా మరలి పోతే నేను లక్ష్మి దేవిని ఎలా అవుతాను ? నామర్యాద కోసమైనా కోరు".

నీ మర్యాద నేను నిలబెట్ట వలసిన దానివైతే నువ్వు లక్ష్మి వేమిటి ? అవునూ ఇంతకీ నువ్వు అసలు లక్ష్మిదేవివేనా ?

"ఏమలా అడిగావు. వారందరికి కోరికలు తీరుస్తూవస్తున్నాను కదా! ఇదిగో వరదముద్ర. ఇది అభయముద్ర. ఇంకా అనుమానమా"?

"అది కాదు. లక్ష్మి దేవి దర్శనం అయితేనే చాలు, అన్ని కోరికలు తీరిపోవాలి. నువ్వు ప్రత్యక్షం అయిన తరువాత కూడా ఇంకా నాకు కోరిక అనేది మిగిలి ఉందంటే – అది నీ దరిద్రమే కాని నా దరిద్రం కాదు. ఇక నిజమైన లక్ష్మి కోసం నేను తపస్సు చేసుకోవాలి అడ్డురాకు. నీకు పుణ్యం ఉంటుంది."

ఈ సంభాషణ విని 'ఇంతేనా' అని నోరు చప్పరించి, 'మాయింటికి రావద్దులే తల్లీ!' అని నమస్కారం చేసి అంతకు ముందు వాడు చరా చరా నడిచి పోయాడు. ఇంతకీ మనంలేచిన వేళ బాగుండ లేదు అనుకుంటూ వైకుంఠానికి తరలిపోయింది లక్ష్మి దేవి.

* * *

లక్ష్మి : అదేమిటండీ ఎక్కడి నుండి వస్తున్నారు, ఆవాలకం ఏమిటి?

విష్ణువు : ఏమీలేదు. ఒక చిన్న మడతపేచీ వస్తే తీర్చుకొనటానికి భూలోకం వెళ్ళి వస్తున్నాను.

లక్ష్మి : ఈ రూపంలో మిమ్మల్ని ఇంతకు ముందు చూసి నట్లుందే?ఉండండి చెబుతాను. అవునూ.... అమ్మదొంగా ! మీరే కదూ, చివరి భక్తుడి రూపంలో వచ్చింది ?

విష్ణువు : అవును మరి నిన్ను కాస్తా ఆ నాల్గవ వాడు ఇంటికి తీసుకు వెళ్ళి పోతే నా పనేం గాను ? ఇక ఈ ఆదిశేషుడితోపాటు బుసలు కొట్టుకుంటూ కూర్చోవాలి, అందుకని ఐదవ వాడుగా రావలసి వచ్చింది.

## అనుబంధసూక్తులు

1) ఏది కోరినా ఇవ్వగల సామర్థ్యంఉన్న భగవంతుడే ప్రత్యక్షమై కోరుకోమన్నా - సగటు మానవుడు ఇంద్రి సౌఖ్యాలనే కోరుకుంటాడు.

2) ఈ ప్రపంచంలో అన్ని కోరికలూ పూర్తిగా తీరిన వారు ఉండక పోవచ్చునేమో గాని కోరికలు లేని వారు మాత్రం కొంతమందైనా ఉండవచ్చు. అటువంటివారికి సాక్షాత్తు లక్ష్మీదేవే ప్రత్యక్షమై గూడా వారికి ఏ వరం ఇవ్వకుండానే వైకుంఠానికి వెళ్ళి పోవల్సివస్తుంది.

3) కోరికలు తీరని భక్తులు - లౌక్యం లేకపోతే భగవంతుని చేత గూడా బానిసలాగా పనులు చేయించుకోడానికి ప్రయత్నిస్తారు.



# పైసా కి లక్ష

"గంగే చ యమునే కృష్ణే .......... శెట్టిగారూ ! గోత్రం చెప్పండి" (నీళ్ళలోంచి పైకిలేస్తూ ఎగాదిగా చూస్తూ) "ఎవరూ !"

'నేనే ... మీరు గంగా స్నానం చేయవచ్చారని తెలిసి ఇలా వచ్చాను. సంకల్పం చెప్పి, మీ చేత ......'

'నేనేమీ మిమ్మల్ని అడగలేదే ? అసలు ఎవరన్నా కనపడతారనే గదా నేనిలా ఒంటరిగా ఇక్కడికి వచ్చి స్నానం చేసేది'.

"అవును. అందుకే వచ్చాను. మీకు స్నానఫలం దక్కించటం కోసం పనికట్టుకు వచ్చాను. మీరు నోరు తెరిచి అడగాలా మీ అవసరం నాకు తెలీదూ ?"

'సరే కానీండి, వచ్చారుగా ఇంక తప్పుతుందా ....'

* * *

'నా పని పూర్తి అయింది. మీకు దేశంలోని సమస్తమైన నదులలో స్నానం చేసిన పుణ్యం దక్కింది. మీ అర్ఘ్య ప్రదానం కూఢా సమస్త దేవతలకు అందింది. మీరు పరమేశ్వరుని కటాక్షానికి పాత్రులైనారు. మరి ఇక నన్ను పంపించండి.'

'ఎంత ఇవ్వమంటారు.'

'మీ ఇష్టం. ఆపైన నా ప్రాప్తం.'

'అలా అంటే ఎలా ? ఎంతో చెప్తే ఇచ్చేస్తాను'.

'మీకు సబబుగా తోచినంత.'

'పైసా ఇద్దామనుకుంటున్నాను.'

'శుభం. ఇప్పించండి.'

'అరె..... చిల్లర లేదే.... పోనీ ఇంటికి రారాదూ.'

'అలాగే. ఇంటి వద్ద కలుస్తాను, మరి వస్తాను, శెలవ్ !'

'వెట్టివాడు. అడ్రసు కూడా తీసుకోలేదు. ఈ రోజు ఈ పైసా కూడా లాభం. దక్షిణ ఇవ్వక్కర లేకుండానే పుణ్యం దక్కింది. వెట్టి బ్రాహ్మణుడు ఇంకేం వస్తాడు, ఎక్కడికని వస్తాడు ! ప్రొద్దున్నే మా ఆవిడ ముఖం చూచాను. అందుకే ఈ లాభసాటి బేరం ప్రొద్దున్నే.....'

* * *

"అరె ! అరుగు మీద కూర్చున్నది వాడు లాగే వున్నాడే ! నా కంటే ముందెలా వచ్చాడబ్బా ! అడ్రసు కూడా తీసుకోలేదు. తస్సదియ్యా వీడెవడో అసాధ్యుడులా వున్నాడు... ఎప్పుడో వచ్చేశారే.'

'మరి నా బాకీ వసూలు చేసుకుపోవద్దా'

'తప్పకుండానూ. ఉండండి లోపలికెళ్ళి వస్తాను....'

'...........'

'పంతులు గారూ ఏమనుకోకండి వెధవది చిల్లర ఇంట్లో కూడా లేదు. రేపు కనపడతారేమిటి ?'

'ఎన్నింటికి రమ్మంటారు ?'

"సరిగ్గా ఎనిమిది గంటలకి".

* * *

"ఒరే అబ్బాయ్ టైమ్ ఎంతైందిరా ?"

'సరిగ్గా ఎనిమిది గంటలు శెట్టిగారూ.'

'ఓ! మీరు వచ్చేసారే ... సరిగ్గా వూరికెళ్ళే సమయంలో వచ్చారు. ఏమనుకోకుండా రేపు రాగలరా ?"

'అలాగే ఇదే సమయానికి వస్తాను'.

'ఈ బ్రాహ్మడెవరో దేవాంతకుడులా వున్నాడు. గడియారాన్నే దిద్దాలి. వీడి పన్చ్యువాలిటీ వీడు పాడుగానూ ! తస్సదియ్యా ! ఇంత జరిగిం తర్వాత కూడా ఇస్తే నా గొప్పతనం ఏముంది. ఈ సారి రానీ చెప్తాను.

* * *

"శెట్టిగారు ఉన్నారా అబ్బాయ్ !"

'ఇంట్లో చూసి చెప్తాను ...... లేరు. బజారు కెళ్ళారు.'

'సరే ఏంచేస్తాం వచ్చేంతవరకు ఇక్కడ వుంటాను లే ".

'.............'

* * *

'సాయంకాలం అయింది. ఇంక రారేమో పోనీ రేపు రారాదూ పంతులు గారూ.'

'అలాగేనమ్మా రేపు వస్తాను.....'

'పోయాడా ? పీడ వదిలింది. కాని రేపు మటుకు యిలా ఇంట్లో భయపడుతూ కూర్చోలేను. ఇంక ఏదైనా ఉపాయం ఆలోచించాలి".

* * *

"అమ్మా శెట్టిగారు లేరా ఇంట్లో" ?

'ఉన్నారు. కానీ ఏం చెప్పను ? ప్రొద్దున్నించీ విడవకుండా ఒకటే కడుపునొప్పి పాపం ! ఏమి చేసినా తగ్గటం లేదు'

"అరె ! మీరు కంగారు పడకండి అమ్మగారూ ! నా దగ్గర ఒకటో రకం మూలిక వుంది. ఇది వాడామంటే దెబ్బకి కడుతుంది. కాకపోతే నీళ్ళల్లో కలపంగానే కొంచెం ఘాటుగా ఉంటుంది. రుచి కూడా కాస్త చేదుగా వుంటుందనుకోండి. కాని తగ్గటం గ్యారంటీ. ఆ ! ఏరీ ఆయన ...... ఆ! చూడండి శెట్టిగారు ఈ గ్లాసెడు కషాయం తాగండి మరి ఏ బాధా వుండదు .........".

"కాస్త చేదంటారేమండీ కాలకూట విషంలా వుంటేనూ. నామీద పగ పట్టారా ఏమిటి ? లేకపోతే ఏమిటండీ మీ మందూ మీరునూ ?"

"అలా అనకండి. ఒక్క అరగంట ఆగితే ఇలా అనరు మీరు. సాక్షాత్తు అమృతం తెచ్చిన ధన్వంతరివి" అంటారు. సరే ఇవాల్టికి నా కవతల పనుంది నేవెళ్తాను. ఈ రాత్రికి అన్నం మానెయ్యండి చాలు."

"గొడ్డు కషాయం ఇచ్చింది చాలక అన్నం కూడ మానెయ్యాలా. శనిలా దాపురించాడు నా పాలిటికి."

* * *

"అమ్మా ! శెట్టిగారు కులాసాగా వున్నారా ! నొప్పి తగ్గిందా ?"

"అయ్యో ఇంకా కులాసా ఏమిటండీ పంతులుగారూ ! మమ్మల్ని నట్టేట్లో ముంచి వెళ్ళి పోయారు. ఇంక ఈ పసివాడికి ఎవరు దిక్కు ? ఇంత అన్యాయం చేస్తారనుకోలేదు. ఆ భగవంతుడికి ఇంత నిర్దయ ఎందుకో మా మీద ......."

"అయ్యయ్యో ! ఎంత పని జరిగింది ? బస్తాలా ఉండే శెట్టిగారు వట్టి పుణ్యానికి ఇట్టే పొయ్యారే ? అవునమ్మా చెప్పలేము. ఎప్పుడు ఎవరికి ఎలా రాసిపెట్టి ఉంటుందో. 'జాతస్యహిధ్రువోమృత్యుః" తప్పదు. తప్పదు ఎప్పటికైనా ఈ పుట్టినవాడు గిట్టాల్సిందే. విచారించకండి. ఆయన ఆత్మక్షోభిల్లుతుంది. కర్తవ్యాన్ని ఆలోచించండి. పాపం పసివాడు మీ అబ్బాయి. ఒరే నాయనా అబ్బాయ్ ! ఇలారా ! ఇలాంటి సమయంలో ఎవ్వరూ మనకి సహాయం చెయ్యరు. మనమూ మనమే చూసుకోవాలి. చిన్నవాడివి నీకేం తెలియదు. ఒక కాగితం, కలం పట్రా. ఇప్పుడు కావలసిన సామానులు లిస్టు వ్రాసి పట్టుకొస్తాను. ముందు ఆయన తల దగ్గర ఓ దీపం పెట్టండి".

* * *

"ఏమిటమ్మా ఇది. మీ మమకారం గానీ ఆయన ఎప్పుడో పోయారు. పుణ్యాత్ముడు. ఇది వట్టి కట్టె. వదలండమ్మా మీరు .... ఊఁ !..... కానీండి, ఎత్తెయ్యండి ... గోవిందా...."

* * *

"వద్దంటుంటే వచ్చారు. అమ్మగారూ మీకెందుకు చెప్పండి. ఈ దృశ్యాన్ని మీరు చూడలేరంటే వినరు మీరు. దూరంగా అలా చెట్టు క్రింద ఉండండి మీరూ, మీ బిడ్డాను. ఈ తల క్రింద కొఱివిని మీరు చూడలేరు..."

"నా మాటవిని మీరు మీ బిడ్డను తీసుకొని వెళ్ళిపోండి. ఎంతలోకి, ఈ కట్టె అంటుకోవడమే ఆలస్యం. ఆ తర్వాత ఆగమన్నా ఆగదు."

* * *

"అమ్మయ్యో ! చుఱుక్కుమంటోంది; అంటుకున్నట్టున్నది. వీడి శ్రాద్ధం బెట్ట ! బ్రతికున్న వాడినే చంపేస్తున్నాడు, కాళ్ళు మంటకి తగిలినట్టున్నాయి. చుట్టూ ఎవరూ కూడా లేనట్టుందే ! .... పీడ విరగడ అయింది. ఇక నేనెలాగూ చచ్చినట్టే లెక్క గాబట్టి నా జోలికి రాడు వెధవ ముండాకొడుకు. లేకపోతే నాతోనా ఆటలు ?"

"కానీ .......... నా పైసా ఇచ్చి వెళ్ళండి మీ ఇష్టం వచ్చిన చోటికి."

"ఓర్నీ ! రామేశ్వరం వెళ్ళినా శనేశ్వరుడు తప్పనట్లు ప్రాణాలు పోయినా ఈ ఇవ్వటం తప్పలేదే. వ్రతం చెడ్డా ఫలం దక్కలేదే. బాబూ ఇదిగో నీ పైసా ! ఇక నన్నొదులు నీకో దణ్ణం."

"శెట్టీ! నువ్వంటే నాకెంత అభిమానమయ్యా ! నేనెవరో అనుకుంటున్నావు గదూ ! చూడు నేనెవరో !"

"అయ్యయ్యో ! నేనెంత పాపాత్ముణ్ణి స్వామీ ! కాశీ విశ్వేశ్వరా ! క్షమించండి."

"లే శెట్టీ ! ఎలా అయినా అదృష్టవంతుడివి. నిజంగా ఎంత అదృష్టవంతుడివి గాకపోతే నా చేత తలక్రింద కొరివి పెట్టించుకో గల్గుతావు,

ఇంద్రుడు, వరుణుడు, వాయువు, కుబేరుడు ఈ నల్గురూ నిన్ను మోస్తారు. క్రిందటి జన్మలో నీ దగ్గర ఒక పైసా తీసుకొని ఈ జన్మలో నిన్ను ఒక లక్షాధికారిని చేశాను. ఈ జన్మలో కూడా ఇంకో పైసా తీసుకొని వచ్చే జన్మలో కూడా మళ్ళీ లక్షాధికారిని చేద్దామనుకున్నాను. కాని ఆ పైసా కోసం నన్ను నానా తిప్పలూ పెట్టావు గదయ్యా ! అయితే ఏం లే ! వచ్చే జన్మలో నువ్వు మళ్ళీ లక్షాధికారివే. కానీ నన్ను కూడా కాస్త కనిపెట్టుకుని వుండు మరి !"

'ఎంతమాట ! ఈ రూపాయి ఉంచుకోరాదూ !'

'నాకంత ఆశలేదయ్యా. అయినా ఎవరికైనా ప్రాప్తం అని ఒకటుంటుందిగా !

## అనుబంధసూక్తులు

ఎ) వేసవి కాలంలో వివిధ జలాశయాల్లోని నీటిని తన కిరణాలతో తక్కువ పరిమాణంలోనే స్వీకరించినా వర్షాకాలంలో అంతకన్న ఎన్నో రెట్లుగా వర్షాన్ని గుమ్మరించే సూర్యుని లాగా – మన దగ్గఅ నామమాత్రంగా స్వీకరించి అంతకు ఎన్నోరెట్లు తిరిగి ప్రతిఫలంగా ఇచ్చేవాడే భగవంతుడు. ఆ కాస్త ఇవ్వడాని గ్గాడ మనం పిసినారిలా వెనకాడితే – మన వెనకనే ఉండి మన చేత ఇప్పించుకుని మరీ మనకి తిరిగి ఇచ్చేవాడే భగవంతుడు.



# పరిష్కారం

'నమస్కారమండీ!'

'ఓహో! శాస్త్రులుగారా! అప్పుడే వచ్చేశారే ..... కూర్చోండి."

"మీరు నన్ను ప్రొద్దున్నేరమ్మని కబురు పెట్టడం - ఇంక ఆలస్యం చెయ్యడమూనా! ఎంతమాట! మరి అసలు విషయం సెలవివ్వండి."

'మరేంలేదు ....... ఒక చిన్న సందేహం',

'ఏమిటో చెప్పండి మరి'

'ఒక జరగకూడని పని జరిగింది.'

'ఏమిటి? ఎక్కడ? ఎవరివల్ల?'

'ఎక్కడో , ఎవరి వల్లనో అయితే నాకంత ఆతృత, ఆదుర్దా దేనికి? నావల్లనే, మా ఇంట్లోనే జరిగింది.'

'అయ్యో! అయ్యో! బహుశా తెలియక చేసివుంటారు. ఇంతకూ అదేమిటో చెప్పెయ్యండి'.

'కోపంలో ఎవరి మీదనో విసరబోయిన చేతికర్ర కాస్తా పిల్లి మీద పడింది.'

'పడితే, అదిమీరు వెళ్ళ బోతుంటే ఎదురొచ్చి 'మ్యావ్' అని పలకరించి వుంటుంది. ఆంతేనా?'

'అంతే అయితే మీ దాకా కబురు ఎందుకు శాస్త్రుల్లుగారూ !'

'మరి అయితే ఏమయింది?'

"ఏమీ అనకుండానే చచ్చింది"

'శివ! శివ! శివ! శివ! పొద్దున్నే ఎంత అమంగళకరమైన వార్త విన్నాను. రామ! రామ! చేతులారా పిల్లిని చంపారుటండీ !'

'ఏమండీ నిజం చెప్పండి, ఇది పెద్ద పాపం అంటారా ?'

'పెద్ద అని ఇంకా చిన్నగా అంటారేమిటండీ! చాలా చాలా పెద్ద పాపం. దానికి విరుగుడు కూడాలేదు.'

'అంతేనంటారా, నాపాపానికి పరిహారం లేదా? అనుభవించాల్సిందేనా?'

'ఉండండి మరి! మరీ అలా బేలపడిపోతే ఎలా? కాస్త శాస్త్రం చూసి చెప్తాను. ఏమన్నా మార్గం వుందేమో!.....ఆ.... చీమని చంపితే .... కుక్కని చంపితే ...... కప్పని చంపితే...... ఆ అన్నిటికీ వున్నాయి గాని పిల్లిని చంపితే పరిహారం చెప్పలేదండీ!'

'బహుశా పాపంఅయివుండదు.'

'ఆ! మాతాతగారు అంటూ వుండేవారు. పిల్లిని చంపితే మరి పుట్టగతులు వుండవని, దాన్ని మించిన పాపం మరోటి లేదని, ఒకేఒక అవకాశం వుందని అంటూ వుండేవారు.'

" ఆ! ఆ! అదేదో కాస్త సెలవియ్యండి"

'ఒక దేవాలయం కట్టించి, దానికి బంగారు పూత పూయిస్తే పరిహారం అవుతుందని.'

"అమ్మబాబోయ్ ! అంత పెద్ద పాపం చేశానన్నమాట. ఖర్మ! బంగారు పూత దేవాలయం అంటే మాటలా? మరి నా బ్రతుకిలా కావలసిందేనా?......... ఏమండీ శాస్త్రుల్లుగారూ! మరికాస్త విచారించండి. కాస్త తక్కువ లో పోయేదేమన్నా వుందేమో పరిష్కారంచెప్పండి. అంత నేను తట్టుకోలేను."

'అదేమిటండి అలా అంటారు! మీరు తలచుకుంటే అట్లాంటివి పది దేవాలయాలు కట్టించగలరు, అలా అంటే ఎలా?'

'సరేలెండి. నన్ను చూసి అందరూ అలాగే అనుకుంటారు. అసలు సంగతి ఎవరికి తెలుస్తుంది?'

"ఒక్క మీకు తప్ప"

"మా బాగా చెప్పారు. ఇంతకీ నా మాటవిని రెండో పద్ధతి ఏమన్నా వుందేమో చూడండి. సరే! కనీసం పిల్లి అంత బరువుగల బంగారంతో చేసిన దేవాలయం ప్రతిమను ఒక సద్బ్రాహ్మణుడికి దానం ఇవ్వండి.'

'అదైతే మటుకు తక్కువ అవుతుందా ?'

మీరు చేసిన పాపం మటుకు తక్కువదా ?

'అవునయ్యా ! చంపాలని చంపటం కాదుగా. చంపాలని చంపితే నువ్వు చెప్పినట్లు చేసినా కాస్త సబబు.'

'మరయితే ఏమంటారు ?'

'బాగుంది వరస ...... సరే ! పిల్లి అంత బరువు తూగనక్కరలేదు. ఒక బంగారు దేవాలయం ప్రతిమను దానం ఇవ్వండి చాలు.'

'శాస్త్రుల్లుగారూ ఎంతసేపూ బంగారం, బంగారం అని అంటారే గాని, మరొకటి కనపడదేమిటి మీ కంటికి ?'

'మీ పాపం కూడా బంగారం లాంటిది, చాలా ఖరీదైనది. మరి పోవాలంటే అది తప్ప ఇంకోటి ఎలా ?'

'పోండి మీ చమత్కారం, మీరూనూ ! పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణ సంకటం లావుంది, మిమ్మల్నీ నన్నూ చూస్తుంటే,

"చెలగాటం అంటూనే ఆ పిల్లిని కాస్తా పర లోకం పంపించింది ఎలుక. ఏం చెప్తాం కలియుగం."

"మాటలు తగ్గించి మరో మార్గం చెప్పండి. నాకు అవతల కొట్టు తెరిచే వేళయింది."

"బంగారు ప్రతిమకు ప్రత్యామ్నాయంగా ఒక సద్బ్రాహ్మణుడికి తాంబూలంలో నూట పదహార్లు పెట్టి దానం ఇచ్చి ఈ పాపకూపం నుంచి బయట పడండి."

'నేను ఇంకోడి మీద వేయబోతున్న కర్ర పొరపాటున దాని మీద పడినందుకు నాకింత శిక్షవేయటం మీకింత భావ్యం కాదు.'

"పడినందుకు కాదు. దాన్ని పరలోకానికి పంపినందుకు."

"ఊరికే నన్ను కురుపు సలిపినట్టు సలపకండి, మాటి మాటికి పిల్లిని చంపారు, పిల్లిని చంపారని అంటూ..... యథాశక్తి నాకు తోచినది తప్పకుండా దానం ఇస్తాను. ఈవిషయంలో నన్ను మీరు మన్నించాలి.

ఎవరో ఎందుకూ? తమరే రేపు ఉదయం 8 గంటలకు వచ్చి పని పూర్తి చెయ్యండి...."

* * *

'ఆ ! అంతా అయిపోయినట్లే ! ఇక చెప్పండి. మార్జాల హత్యాపాప పరిహారార్థం యథాశక్తి దక్షిణ సమర్పయామి, అంటూ మీరు ఇచ్చేదెంతో ఇచ్చి, నీళ్ళు ధారగా నాచేతిమీదుగా పొయ్యండి.'

"ఏమే వర్ధనీ ఒక రూపాయి బిళ్ళ పట్రా అర్జంటుగా.... !!!"

'ఏమండీ, బీరువాలోను, మీ చొక్కా జేబులోను, చివరకు గల్లా పెట్టెలో కూడా వెతికాను. ఎక్కడా రూపాయి బిళ్ళ కనబడలేదండీ."

'పంతులుగారూ, ఎక్కడా కనపడలేదంటోంది. పోనీ రేపు రారాదూ!. మీరు మరోలా అనుకోకండి. ఈ పని పూర్తయినట్లేగా. అయితే ఒక్క విషయం చెప్పండి !'

'ఏమిటి మరొక సందేహమా ? లేక హత్యా ?'

'సందేహమే ! కేవలం సందేహమే !'

'మొదట దాని తాలూకు దక్షిణ ఇంకా తేలలేదు. మరో సందేహానికి సమాధానం కోరుతున్నారా ?'

'అబ్బే మీ సొమ్ము మాకెందుకు !'

'అయితే చెప్పండి.'

'ఇంతకీ నేను పిల్లిని చెంపిన పాపం పోయినట్లేనా ?'

'ఇంకా అనుమానమా ? అంత పెద్దెత్తుగా మంత్ర పూర్వకంగా, తతంగం అంతా నడిపి జలధారతో మీ పాపాన్ని నేను కడిగి వేసేస్తేనూ, ఇక ఆ పాపం అంతా పుచ్చుకున్న నాదే ! మీకేమీ దిగులు అక్కర లేదు. మరి నా దక్షిణ నాకిప్పించండి."

"తొందరపడకండి. నా అసలు సందేహం తీరనే లేదు. ఏం లేదు ఒకళ్ళకు కొంత ఇస్తానని మాటిచ్చి ఇవ్వలేదనుకోండి అదీ పాపమేనా ?"

'కాదు మరీ ! అదీ పాపమే !'

'ఏదీ ! పిల్లిని చంపినంతదా ?'

'అబ్బెబ్బే ! అంతెందుకు అవుతుంది ! పిల్లిని చంపటం చాలా పెద్ద పాపం. ఇదెంత, చాలా చిన్నది. కేవలం చిన్న అసత్యదోషం. అది కొండంతయితే ఇది కుండంత అనుకోవచ్చు. దానికీ దీనికీ పోలికే లేదు.'

'అయితే మీరు చెప్పినట్లు అది చిన్న అసత్యదోషం అన్నమాట! అంతేగా ! నేను పిల్లిని చంపగా వచ్చిన పెద్ద పాపం నాకు పోనే పోయింది అని మీరే అంటున్నారు. అంతేగదా ! నాకంటదుగా ?'

'ఎందుకంటుతుందీ !'

'ఇకపోతే మీకు దక్షిణ రూపాయి ఇస్తానని ఇవ్వలేకపోయిన ఈ చిన్న అసత్యదోషం నాకే ఉండనివ్వండి, ఫరవాలేదు. తట్టు కోగలను.'

'ఇందాక మీరు స్నానం చేస్తున్నప్పుడు మీ పిల్లవాడీకాగితం పట్టుకొచ్చాడు. తీరా చూద్దాను గదా నేను లోగడ మీ వద్ద తీసుకున్న వంద

రూపాయలకు నేను మీకు వ్రాసిచ్చిన ప్రోనోటు. అందుకే నేనూ తట్టుకోగలను. మరి వస్తా !!

## అనుబంధసూక్తులు

ఎ) తీర్చగల సామర్థ్యం ఉండి గూడా బాకీ తీర్చకుండా వెధవ్వేషాలు వేస్తే- చెవులు పిండి మరీ వసూలు చేసి, 'బాలన్స్‌షీట్" వేసేవాడే భగవంతుడు.

బి) ఎప్పటికైనా ఇద్దరిమధ్యఉన్న లావాదేవీలను పూర్తిగా పరిష్కారం చేసేవాడు భగవంతుడే !



# హేతువాదం

'మీరు ఎంత పెద్ద ఎత్తు వేసినా పై యెత్తు వుండనే వుంటుంది.'

"అలాగేం? ఇంతవరకు ఈ రామరాజుతో ఇలా అన్న వారెవ్వరూ లేరు. ఊఁ ! ఈ ఎత్తుకు సమాధానం చెప్పండి".

'అలా అనగలిగేవాడు, మీ యెత్తుకు సమాధానం చెప్పగల్గే వాడు ఉంటాడని చెప్పటానికే నేను వచ్చింది. ఇదిగో, 'రాజు!' మీ ఆటకట్టు సరేనా?'

'అబ్బా! ఏమి ఎత్తు వేశావయ్యా!'

'రాజాధి రాజాయ ప్రసహ్య సాహిణే నమో వయంవై శ్రవణాయ కుర్మహే–'

'చూడండి రాజుగారూ! ఎవరో దసరా బ్రాహ్మణులు వచ్చినట్లున్నారు'.

'ఏముంది పనివీళ్ళకి, దసరా వచ్చిందంటే ఈగలు ముసిరి నట్లు ముసురుతారు గుంయ్ మంటూ....... ఆ ఆ ఇంతకూ ఏమంటారు ఆ పండిత వృషభాలు?'

'ఏమంటారు ఇక్కడ కామధేనువులాంటి మీరున్నారని వచ్చివుంటారు'.

'కృష్ణా మండల బ్రాహ్మణులము. పట్టా సంపాదించిన వాళ్ళము. మీ దాతృత్వము తెలిసి వచ్చాము'.

'ఇస్తే ఏం చేస్తారు?'

'మీ శిరస్సు పై అక్షంతలు చల్లి, మిమ్మల్ని ఆశీర్వదిస్తాము'.

'ఏమని?'

'మీరు పూర్ణాయుర్దాయముతో సమస్త భోగ ఐశ్వర్యాలతో తులతూగేట్టు చేయమని'.

'మీ ఆశీర్వచనానికి అంత ఫలితం వుంటుందా?'

"............."

'నిజంగా అంతబలం, పటుత్వం మీ ఆశీర్వచనాలకుంటే ఆ అక్షతలేవో మీ నెత్తిమీద మీరే వేసుకొని, మిమ్మల్ని మీరే ఆశీర్వదించుకొని భాగ్య వంతులవచ్చుగా ! ఇంత దూరం రావడం దేనికి? నా నెత్తి మీద చల్లడం దేనికి?....... నేను భాగ్యవంతుణ్ణి అవటం, అప్పుడు నేను యిచ్చే దక్షిణ పుచ్చు కోవడం. అబ్బెబ్బే! ఎంత డొంకతిరుగుడుగా, తెలివి తక్కువ తనంగా వుందో చూశారా మీరు చేసేపని? బ్రహ్మ వరం కోరుకో మంటే మేనల్లుడు మేనమామ చెవులో వెంట్రుకలు కోరినట్లు లేదూ!'

"........."

'అంబా!'

'ఏమండీ! కొట్టంలో ఏవో ఆవులు అరుస్తున్నట్లున్నాయ్... ఆ , అవును ఎక్కణ్ణుంచి తెప్పించారు రాజుగారూ! ఈ ఆవుల్ని మాంచి దృఢంగా వున్నాయ్'.

'స్వయంగా మైసూరు వెళ్ళి ఏరికోరి తెచ్చుకున్నాను'.

'తేవడానికేం అందరూ తెస్తారు. కానీ, ఆ తెచ్చిన వారందరూ ఇంత చక్కగా పెంచగల్గుతున్నారేమిటి ? అవునూ, ఆవులకు మేత ఏం వేస్తున్నట్లో?'

"ఇద్దరు పాలేర్లను పెట్టాను. పొలం గట్టు మీద పచ్చ గడ్డి కోసుకొస్తారు. చిట్టూ, తౌడు అన్నీ ఒకటో రకం. రోజూ మనలాగే వాటికీ ఒళ్ళూ అదీ శుభ్రంగా కడిగిస్తాను. ఇంక చెప్పకండి, పోషణ విషయంలో లోటు రానిస్తానా?"

'అవునవును అంత ఇదిగా తగినంత మేత వేస్తారేమో, పూటకు 10 శేర్లకు తక్కువ గాకుండా పాలు కళ్ళ చూస్తారనుకుంటాను'.

'ఒక్కొక్కప్పుడు 15 శేర్లదాకా వస్తాయిలెండి. ఏ మాటకామాటే చెప్పుకోవాలి'.

'రావుమరీ! అంత పెట్టుబడి పెట్టినప్పుడు...... కాని, ఎన్ని పాలు వచ్చినా మీరు వాటి మొహాన అంత పెట్టుబడి పెట్టడం అనవసరమేమో అనిపిస్తోంది. ఆమాట కొస్తే మీరు అనవసరంగా దుబారా చేస్తున్నారని తోస్తోంది నాకు'.

'దుబారానా ? భలేవాడివయ్యా'

'కాకపోతే ఏమిటి చెప్పండి. ఈ ఆవులు రెంటి కోసం ఇద్దరు పాలేర్లా ? వాళ్ళకి జీతమా ? వాళ్ళు పొలానికి వెళ్ళి గడ్డి పట్టుకురావటమా? అంతా అవేతిని పాలు ఇవ్వడమా ? ఎంత వృథా చేస్తున్నారో మీకు తెలియటంలా !'

'వృథానా ?'

"ఆ ! కాక ! ఆ పాలేర్లతో పని లేకుండా మీరే సరాసరి పొలానికి వెళ్ళి, అక్కడ గడ్డి కాస్తా కడుపునిండా మేసేసి, ఇంటి కొచ్చి ఆ చిట్టూ

,ఉలవలు, తౌడు ఇంకా ఏ వేవో తినేస్తే మీకే ఆ పాలు పడేవి కాదా! పాలేర్ల జీతానికి జీతం కలిసి వచ్చును, మీకా ఆహారం ఖర్చు తప్పును. మరి ఇప్పుడు చెప్పండి. మీరు చేసే పని ఎంత డొంక తిరుగుడుగా, తెలివి తక్కువగా, మేనల్లుడు మేనమామచెవిలో వెంట్రుకలు కోరి నట్లుందో?

'...........'

'వేద బ్రాహ్మణులంటే మిమ్మల్ని ఆశ్రయించు కొని వుండే ఆవుల్లాంటి వారు. మీరు ఎంతగా వారిని సంరక్షించు కుంటే, మీకు అంత సంపద క్షీరంలా వర్షింపజేస్తారు అని తెలుసుకోండి..... గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం ...... మరి నే వస్తాను'.

"..............."

'ఒరే అబ్బిగా పక్కింట్లో వున్నట్లున్నారు ' ఆ దసరా బ్రాహ్మణుల్ని ఇలా పిల్చుకురా'.

## అనుబంధసూక్తులు

ఎ) తర్కంతోను, లౌక్యంతోనూ జయిద్దాంమని, సాధిద్దామని అనుకునే వాళ్లని - ఆ తర్కంతోనే, ఆ లౌక్యంతోనే వాళ్లను జయించి బుద్ధి చెప్పే సన్నివేశాల్ని కల్పిస్తాడు భగవంతుడు.

బి) తర్కం ఎంత పనికి రాని విద్య అంటే - ఒక్కొక్కప్పుడు మనల్ని అది రక్షించడం కన్న - దాన్నే మనం రక్షించాల్సిన దుర్గతి దానికి పడుతుంది.

సి) తర్కం ఒక్కటీ సత్యాన్నివ్వదు, మహా అయితే - సత్యాన్ని పొందడానికి సహాయపడుతుంది - అది గూడా దాన్ని సరిగ్గా అన్వయిం

❋❋❋

# గెలుపెవరది ?

పోస్టు"

"చూడు. ఉత్తరం వచ్చినట్లుంది ......."

"................"

"ఆ! ఎవరి దగ్గర్నుంచి ?"

"ఉండండి ........ చదవనీయండి ..... ఉ ...... ఉ.......... వినండి వినండి ........ ముఖ్యముగా వ్రాయునది ఏమనగా ..... మీరుభయలూ మా అమ్మాయి సుధ వివాహానికి తప్పక రావలెను. ఇవాళ సాయంత్రం గాని, రేపు ఉదయం గాని చి॥ ప్రభాకరం వచ్చి మిమ్ము స్వయానా ఆహ్వానిస్తాడు. మా యింట్లో నేను చేసే ప్రథమ శుభకార్యం ఇదే కాబట్టి చెల్లెలు సుజాతను వెంటబెట్టుకొని తప్పక రావలెను....."

"అప్పుడే పెళ్ళి చేసేస్తున్నాడే మీ అన్నయ్య. పిల్లకి పదహారేళ్ళన్నా ఉన్నాయంటావా ?"

"ఆ ! మొన్న శ్రావణ పౌర్ణిమకు పదహారెళ్ళి పదిహేడొచ్చింది... ఏముందీ అన్ని విధాలా తగిన సంబంధం కలిసి వచ్చి ఉంటుంది, చేస్తున్నాడల్లే ఉంది లేకపోతే ఇంత తొందర్లో చెయ్యాల్సిన అవసరం ఏమిటి ? ..... సరే! ఏమిద్దాం ప్రెజెంటేషన్ ? చెప్పండి మీరే ఇవాళే వెళ్ళి కొనుక్కొద్దాం."

"రేపు చూడొచ్చు లెద్దూ ఇవాళ నాక్కాస్త బద్ధకంగా వుంది. కాస్త కాఫీ పెడ్తావేంటి ?"

* * *

"పెళ్ళి ముహూర్తానికీ చీర బావుంటుంది... సదస్యానికి మొన్న కొన్న ఊలీ ఊలీ శారీ .... స్థాలీపాకానికి పట్టుచీర, సాయంత్రం బంతులాటకు ఫారిన్ నైలెక్స్. తనీ మధ్య కొనుక్కున్న చీరలన్నీ వదినా వాళ్ళకి చూపించాలి......"

"ఇంతకీ వంటయిందా ? చీరలు చూసి మురిసి పోవడమేనా".

"ఏమండీ ! ఇవాల్టికి ఉదయశంకర్‌కి వెళ్తే...."

"ఇవాల్టికి ఉదయశంకర్‌కి, రేపు సెవెన్‌హిల్స్‌కి, ఎల్లుండి అక్కణ్ణుంచి ధామ్మని క్రిందకి".

"పొండి ! మీరెప్పుడూ ఇంతే ! ఓ సరదాయే లేదు మనిషికి. నాకైతే పెందరాళే బయల్దేరి, షాపింగ్ చేసుకొని, ఫస్ట్ షో సినిమా కెళ్ళి, అట్నుంచి ఉదయశంకర్‌లో భోజనం చేస్తే బావుంటుందని ఉంది. అయినా నా సరదా మీరెప్పుడు తీర్చారు గనుక ఏదో వాగుతాను ఇల్లా పిచ్చిదానిలా."

"సర్లేగాని ఏం చేస్తున్నావ్ అన్నంలోకి?"

"ఇప్పుడే గదా ! టిఫిన్ తిన్నాం, అందుకని ఒడియాలు వేయిస్తాను లెద్దురూ ఇవాల్టికి".

"ఒడియాలా నయం. బీరపొట్టు అన్నావు గాదు. అల్లాకాదు గాని బెండకాయ వేపుడు చెయ్యి. తెల్సిందా!"

"అబ్బ ! ఒడియాలు వేయిస్తాన్లెండీ ఇవాల్టికి. నాక్కాస్త బద్ధకంగా వుంది. అయినా ఇప్పుడు తిన్న టిఫిన్ అప్పుడే అరిగిపోయిందా, నా చేత వండించాలని కాకపోతే ! ఏమిటి మీ అధికారం చెప్పండి ? నిజానికి."

"అరక్కపోతే అన్నం ఎందుకడుగుతాను ? వేపుడెందుకు చెయ్యమంటాను. ఆకలి వేస్తోంది గాబట్టే చెయ్యమంటున్నా".

"చెయ్యకపోతే ? విడాకులిస్తారా ? ఆపండి మీ బడాయి కబుర్లు".

"అంతగా చెయ్యాల్సిన అవసరం లేదనుకుంటే చెప్పు. నేనే చేసుకుంటాను."

"................"

"సరే ! నీపని నాకు చేతగాదా ఏమిటి ?"

* * *

"తరిగి అక్కడ పెట్టే ఇక గత్యంతరం లేక చేస్తుందనుకున్నాను లేవదే అక్కణ్ణుంచి. రేపటికైతే వృథాగా ఎండిపోతాయనైనా లేదు. హుం. సరే స్టౌమీద పెట్తే సరి. వచ్చి కలగజేసుకుంటుంది...."

"................"

"అరె ! స్టౌమీద పెట్టినా వెళ్ళి కలియ దిప్పదే ..... ఇలా కాదు ... దీని పని ఎలా పట్టించాలో నాకు తెలీదా ...."

"అమ్మా ! ఎంత పని చేశారు ? స్టౌమీద ముక్కలు పెట్టి దొడ్లో కెళ్ళి కూర్చున్నారు. అబ్బ ! ఎంత పంతం ఈయనకు ! తన మాటే చెల్లాలంటారు ... ఆ మాత్రం తెలివి నాకూ లేకపోలేదు...."

"అరే ! స్టౌ దగ్గరకు వెళ్ళినట్లు లేదే ! అక్కడే కూర్చుంది. ముక్కలు మాడిపోతాయనన్నా లేదుగావును. హు ! చెప్తానుండు ... అబ్బే ! ముక్కలు ఏం మాడలేదు బహుశా వచ్చి కలియబెట్టే వుంటుంది..... ఆ ! అసలు మాడలేదే గాస్ అయిపోయిందేమిటి ఖర్మ ? అంతా రసాభాసవుతుంది. లేదు లేదు. స్టౌ ఆర్పేసి వుందే! ... అమ్మదొంగా ! కదపక పోగా స్టౌ ఆర్పేసిందన్న మాట ! ఓసి దీని తెలివి మండా !! సరే ! ఇప్పుడు మనం ఇక్కడ ఈ స్టౌ దగ్గర నిలబడి వేపుడు చెయ్యడం కంటే అగౌరవమైన పని ఇంకోటి వుండదు. ఎలాగైనా దీని చేత చేయించి తీరాలి ఇవాళ ఆ వేపుడు ......."

"అదేమిటలా వెళ్ళి పోతున్నారు ............ కోప మొచ్చిందేమో! అబ్బ ! ఇంత మొండి ఘటాన్నెక్కడా చూడలేదు. తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళనే రకం. ఇవ్వాల్టికి కాస్త సర్దుకు పోతే ఏం పోయిందో ఛీ ! ఈ మగాళ్ళంతా యింతే ! భార్యలంటే బానిసలనుకుంటారు. చూద్దాం ఇంత దాకా వచ్చిం తర్వాత నాకా మాత్రం ఆత్మాభిమానం వుండదా? వెనక్కి పిలుస్తానని అనుకున్నారేమో! పాపం ఎందుకు పిలవాలి ! వెళ్ళనీ ఆయనే వస్తారు. కడుపులో నకనక లాడితే సరి."

* * *

"అదిగో ! గేటు చప్పుడైంది..... ఆయనతో పాటు ఇంకోళ్ళెవరో సూట్‌కేస్‌తో దిగుతున్నారే ! చచ్చాం. కొంపదీసి ఏ గెస్టన్నా కాదు గదా! ఇంత కథా వృథా అవుతుంది. సరే రానీ - ఈ మాత్రానికే బెంబేలు పడిపోతే ఎలా ?'

"సుజా ! ఏం చేస్తున్నావ్ ? ఇలారా ! ఒకసారి మా ఫ్రెండుని పరిచయం చేస్తాను."

"ఏమండీ ! మీరే ఇలారండి ఒకసారి."

"......... ఓసినీ ! చివరకు దీని పంతమే నెగ్గింది. దైవం దీని పక్షమే వహించాడు. లేకపోతే సరిగ్గా ఇలా అవడమేమిటి ఈ సమయంలో ... మిస్టర్ రఘూ! ఇవాల్టికి మన కింట్లో అన్నం తినే ప్రాప్తం లేదు. ఈ మూడు రోజులు మనమే తంటాలు పడాలి. సరే! ఇవాల్టికి నా కోపిక లేదు గాని, రా ! అటు ఉదయశంకర్‌కి పోయొద్దాం."

"మరి మీ మిసెస్ భోజనం."

"దాని సంగతి అది ఎలాగో చూసుకుంటుంది లే. ప్రక్క వాళ్ళున్నారుగా. ఆ మాత్రం వాళ్ళని ప్రాధేయ పడలేదా ఏమిటి ?..."

* * *

"ఏమండీ ! ఇప్పుడొస్తున్నారు, రాత్రి రాలేదేం ? ఎక్కడి కెళ్ళారు ?"

"వెళ్ళ గూడని చోటుకి వెళ్ళనని తెలుసుగా !"

"తెల్సుకాని, రాత్రి రాలేదుగా"

"అట్నుంచి రెండో ఆట సినిమాకు వెళ్ళి వాళ్ళింట్లోనే పడుకున్నాం."

"వాళ్ళ దీవూరు కాదుగా"

"ఈ వూరే !"

"అబ్బ ! ఎంత నాటకం ఆడారండీ !"

"అయినా నీ మాటే చెల్లించుకున్నావుగా"

"అవుననుకోండి .......... కాని, ఇప్పుడు నేనే ఓడిపోయాను.

"ఏం ? ఓటమి నాదేగా. దైవం నీకనుకూలించాడు నిన్న."

"కాదు ........ ఇవాళ ప్రతికూలించాడు....... నేను ఎంతో వుత్సాహ పడ్డాను. పెళ్ళికి వెళ్ళొచ్చని. కాని నిన్న అబద్ధంగా మూలకూచున్నా, ఇప్పుడు నిజంగా కూచోవలసి వచ్చింది. నా ముచ్చట మూలకూచుంది."

"అబ్బ ! ఇది నాకు రెండో డిఫీట్ అవతల డబ్బుకు డబ్బు ఖర్చూ అయింది, ఇవతల మాటా చెల్లలేదు."

* * *

ఇంతవరకూ కథ చెప్పి 'ఇంతకీ గెలుపెవరిదంటావ్ ?' అని అడిగాడు నా మిత్రుడు. నేను నా కుడి చూపుడు వేలు పైకి చూపించాను.

## అనుబంధసూక్తులు

ఎ) మానసిక దౌర్బల్యాలతో (Complexes) ఉక్రోషాలను తెచ్చుకుని, ఓడినా తమచెయ్యేపై నుండాలనుకొని సతమతమయే జీవుల చర్యలను – తన తాత్కాలిక లీలలుగా, విజయాలుగా పై నుండి వినోదించేవాడే భగవంతుడు. ఇటువంటి లీలల్ని సినిమాల్లో 'కామెడీ ట్రాక్' ల్లాంటివిగా అర్థం చేసుకోవాలి.

✻✻✻

# ఆత్మ సమర్పణ

"నమస్కార మండీ! "

"కూర్చో నాయనా! పాపం చాలా దూరం నుంచి వచ్చినట్లున్నావు"

"అవునండి. అయినా అవసరమైనపుడు దూరం అనుకుంటే ఎట్లా?"

"బాగా చెప్పావు చిన్నవాడవైనా. మరి నాతో అంత అవసరమైన పనేమిటి నాయనా నీకు ?"

" మీరు సంపూర్ణ జ్ఞానవంతులని, త్రికాలజ్ఞులని, ఆత్మవిద్యాసాగరానికి పారం చూసిన వారని తెలుసుకుని తమ దర్శనం చేసుకుందామని వచ్చాను."

"కేవలం దర్శనం కోసం ఇంత దూరం వచ్చావంటే నీకు ఆత్మవిద్యమీదున్న గౌరవాన్ని నామీదనున్న ప్రేమను తేలిగ్గా ఊహించగలను నాయనా."

"కేవలం దర్శనం కోసమేకాదు. ఆ ఆత్మవిద్యను గ్రహించటానికే వచ్చాను. అర్హుణ్ణయితే మీ శిష్యునిగా అనుగ్రహించి, ప్రభోధించ వలసిందిగా ప్రార్థిస్తున్నాను."

"మంచిది నాయనా! ఆత్మవిద్యా ప్రబోధానికి ముందుగా నీవు నాకొక పని చేసి పెట్టాలి."

"చెప్పండి. అవశ్యము చేసి పెడతాను."

"ఏమీలేదు. నీవు అంతా వెతికి ఒక విలువ లేని వస్తువును నాకు సమర్పించు అటుపైన పాఠంచెప్తాను."

"అయితే ఇప్పుడే వస్తాను. మీరిక్కడే వుంటారు కదా!"

"ఇక్కడే నీకోసమే కనిపెట్టుకుని ఉంటాను."

* * *

"ఇంత చిన్న పని చెప్తాడను కోలా! నయమే! చెయ్యలేనిపనేదన్నా చెప్తే ఇరకాటంలో పడేవాణ్ణి. సరే! విలువ లేని వస్తువు అన్నాడు, ఏమి తీసికెళ్ళను? ........... ఆహా! అదృష్టం అంటే ఇలావుండాలి. అనుకున్నానో లేదో, ఆవు ఎదురు వస్తోంది. మనిషి కన్నా పశువు విలువ లేనిదేగదా! కాబట్టి ఈ ఆవును తీసి కెళ్ళి గురువు గారి కిస్తాను."

"ఏం బాబూ!"

"ఎవరది?"

"నేనే, ఆవుని. నీ నిర్ణయం నాకు నచ్చలేదు. నేను మీ మనుష్యులకు ఎంతో సంపూర్ణ ఆహారమైన పాలనిస్తున్నాను. ప్రొద్దున్న లేస్తే కాఫీకి పాలు, జున్ను, పెరుగు, వెన్న, నెయ్యి, ఇన్నీ నావల్ల మీరు పోందుతున్నారు. అయినా నన్ను నీవు విలువ లేని దానిగా జమకడుతున్నావు"

"నిజమే! ఆవువల్ల ఇన్ని పొందుతున్నపుడు దాన్ని విలువ లేని దానిగా పరిగణించడమేమిటి ? సరే! అయితే నీదోవ కద్దురాను ........ మరైతే ఏమిటి తెసికెళ్ళడం........ ఆ! అన్నిటి కంటె ఎండు గడ్డి విలువ లేని

దంటారు పెద్దవారు. అందుకే విలువ లేని దాన్ని గడ్డి పోచతో పోలుస్తారు. ఈ గడ్డి పరక తీసి కెళ్తాను"

"ఏమిటి నీ ఆలోచన?"

"ఎవరది?"

"నేనే గడ్డి పరకను. నీ నిర్ణయం బాగోలేదు. ఇందాక నువ్వు ఆవును వదిలి పెట్టావు. కారణం – అదిచ్చేపాలు మీకు సంపూర్ణ ఆహారం అనేగా! అసలు ఆ పాలు ఎక్కణ్ణుంచి వస్తున్నాయి దానికి? నన్ను అదితిన బట్టేగా! ఎంత అజ్ఞానివి?"

"అవును నిజమే. ఈ గడ్డితినేగా ఆవుపాలిచ్చేది! ఎంత పొరపాటు పడ్డాను! మరైతే దేన్ని తీసికెళ్ళడమబ్బా!"

"...... ఆ! ఈ పేడతీసికెళ్తాను! విసర్జించిన దానికి విలువేముంటుంది గనక?"

"తప్పు నాయనా! అసలు మావల్లనే పొలానికి ఎరువు. ఆ పైన పైరు పండి గడ్డి లభిస్తోంది. అంతెందుకు? దానిపిడకలు, చివరకు మీ ముఖాన పూసుకోడానికి విభూతిగూడా మానుంచే గదా లభిస్తోంది!"

"చచ్చాం, ఈ ఆవు పేడ గూడా చాలా విలువైందేనే! నయమే! తొందరపడ్డానుగాను ....... అయితే పశువుల మలం విలువైందే గాని మానవ మలానికి విలువేమిటి? నిజం. దాన్నే పట్టుకెళ్తాను."

"అబ్బా! ఎంత తెలివి తక్కువ నిర్ణయం ......?"

"ఎవరది?"

"నీ మలాన్నే నాయనా! నువ్వు నన్ను విలువ లేని దాని గా జమ కడుతున్నావు. నేను నిన్ను జేరకముందు ఘుమఘుమ లాడే చక్రపొంగలి, బాదం హల్వా నేగదా! ఎన్నో డబ్బులు పెట్టినన్ను కొనుక్కున్నావు! నీ సాంగత్యం తోనే నాకీ దశ పట్టింది. నీ పొట్టలో పడ్డాను, నా విలువ పోయింది. ఇప్పుడు చెప్పు నువ్వా? నేనా? విలువ లేని వాళ్ళం?....."

* * *

కలచెదరిపోయినా ఉపదేశాత్మకంగా వచ్చింది. "నిజమే! ఇదంతా చూస్తుంటే ప్రపంచంలో అన్నిటికంటే నేనే విలువ లేని వాణ్ణిగా కన్పడుతున్నాను. దీని లోని రహస్యమిదన్నమాట! జ్ఞానోదయం అయింది. ఇదే మొదటి పాఠం అయి వుంటుంది. నన్నే ఆయనకు సమర్పించు కుంటాను."

## అనుబంధసూక్తులు

నీ డబ్బు, నీ ఆస్తి, నీ అందం, నీ అధికారం, నీ పదవి కాదు - నాక్కావాల్సింది 'నువ్వు' - 'నిన్ను సమర్పించుకుంటే నన్నుగా నిన్ను తీర్చి దిద్దుతా' అనే వాడేనిజమైన గురువు. కాని, మనం మాత్రం మనల్నితప్ప చివరకు మనకున్న వాటిని వేటినైనా సమర్పించడానికి సిద్ధపడతాం.

❀❀❀

# "తస్కరాణాంపతయే నమోనమః"

"నారాయణ ! నారాయణ !!" అంటూ నిరంతర నారాయణ స్మరణతో వైకుంఠానికి చేరాడు నారదుడు.

ఆదిశేషువుపై ఆడంబరముగా ఒత్తిగిలి పడుకున్న పరంధాముని పెదవులపై చిఱునవ్వు చిగురించింది మనవడి రాకతో.

"రా నారదా ! రా ! అమ్మా నాన్నా కులాసాయేనా ?"

"నేను ప్రస్తుతం  సత్యలోకం నుంచి రావడం లేదు తాతగారూ!"

'మరి ?'

'భూలోకం నుంచి'.

'ఏం విశేషాలేమైనా ఉన్నాయా ?'

'చెప్పాలంటే పెద్ద విశేషమే ఉంది'.

'ఏమిటో అది ?'

"మీ భూలోక వాసులు పూర్తిగా మారిపోయారు.  అఖండ భజనలు, అర్చనలు, హారతులు, కళ్యాణాలు, ఒక టేమిటి ?  అంతా కోలాహలంగా ఉంది అక్కడ.  సాక్షాత్తు మీరే దిగి వచ్చారా ! అన్నట్లున్న మీ విగ్రహ ప్రతిష్ఠ గూడా జరగబోతోంది.  అంతా ఆ స్వాముల వారి దయ".

"ఎవరా స్వాముల వారు ?"

"ఒక గొప్పభక్తుడు. ఆయన కింకో పనిలేదు. ఊరూరా తిరుగుతూ ఉంటాడు తన శిష్య వర్గంతో. వెళ్ళిన చోటల్లా భజనలు, అర్చనలు, కళ్యాణాలు జరిపిస్తూ ఉంటాడు. ఆయన దయవల్ల భూలోక వాసులందరూ భక్తిని, ముక్తిని మూట కట్టుకుంటున్నారు."

"అంత అదృష్టవంతులంటావా ?"

"కాక ! ఎంతో కష్టపడి తపస్సు చేస్తే గాని రాని ఫలితాన్ని కేవలం నామ సంకీర్తనతో పొందుతున్నారంటే వేరే చెప్పాలా ! మొన్నటికి మొన్న ఒక భజన జరుగుతుండగా చూశాను. అందరూ వళ్ళు మరచి భజనలో లీనమైనారు. అశ్రుపూరిత నేత్రాలతో తన్మయులైనారు...."

"నారదా ! ఒక్క అనుమానం."

"ఏమిటది ?"

"అందరూ ఆ స్వాముల వారంతటి వారయ్యారంటావా?"

"నేనెందుకు చెప్పడం ? ప్రత్యక్షంగానే వెళ్ళి చూద్దాం".

"అంత నమ్మకంగా చెప్తోంటే నాకూ నా భక్తుల్ని, ఆ స్వాముల వారిని చూడాలనే వుంది. పోదాం పద."

* * *

"విష్ణు పాదమూ మేము విడువమూ...." భజన జోరుగా సాగి, తారస్థాయి నందుకుంది. మృదంగాలు పగుల్తాయేమోననిపిస్తోంది. 'పిలకలు ఊడిపోవుగదా !' అనిపించేట్టు తల లాడిస్తూ పోటీలు పడుతున్నారు

ఎదురెదురు భక్తులు. చేతుల మధ్య తాళాలు తరిమి తరిమి కొట్టు కుంటున్నాయి. హార్మోణియంపై వ్రేళ్ళు ముందుకూ వెనక్కూ పరుగులు పెడుతున్నాయి. అరచేతుల మధ్య అగ్ని పుట్టేంత ముమ్మరంగా సాగుతోంది భజన.

అంతే ! ఒక్కసారి లైట్లన్నీ ఆరిపోయాయి.

చీకటి గుయ్యారం. అయినా భజన ఆగలేదు. అది స్వాముల వారి ఆజ్ఞ ! హార్మోణీ పలుకుతోంది. విష్ణు నామంతో గదంతా మారుమ్రోగుతోంది.

కాస్సేపట్లో లైట్లొచ్చాయి. భక్తుల్లో మార్పు లేదు. సంకీర్తన కొనసాగుతూనే ఉంది.......

"స్వామీ ! పళ్ళెంలో బంగారు పంచ పాత్ర ! ......"

"ఏం నాయనా ? ఏమిటా కంగారు ?"

"స్వామీ ! మన పళ్ళెంలోదే బంగారు పంచపాత్ర మాయం..."

"పోన్లే శిష్యా ! దొంగ అనొద్దు తొందర పడి. ఎంత అవసర మొచ్చిందో పాపం. పోతేపోనీ. ఏదో అజ్ఞానం వల్ల చేసి ఉండొచ్చు. ఆ శ్రీహరే అతని అజ్ఞానాన్ని పోగొట్టాలి. పోనీ తను చేసిన పని తనే సరిదిద్దు కోడాని కొక చక్కని అవకాశం కలిగించి చూద్దామా?"

"ఏమిటో చెప్పండి స్వామీ !" అన్ని నోళ్ళు ఒక్కసారి అరిచాయి.

"ఏం లేదు. మళ్ళీ ఒకసారి లైట్లు తీసేద్దాం. అతను తిరిగి పంచ పాత్రను యథాస్థానంలో పెట్టెయొచ్చు. ఎవరూ అతన్ని చూడరు. అతనూ అభిమానపడదు, అవమానం పొందదు. అజ్ఞానం పోతుంది."

"బావుంది ! చాలా బావుంది !! స్వాముల వారు చక్కని ఉపాయం సెలవిచ్చారు." అందరూ వత్తాసు పలికారు.

"అయితే శిష్యా ! ఒక్కసారి వెళ్ళి మెయిన్ తీసెయ్యి"...... గురువుగారి ఆజ్ఞ!! మళ్ళీ అంతా చీకటి గుయ్యారం. మళ్ళీ కాస్సేపటికి లైట్లు వచ్చాయి. అందరి దృష్టీ ఒకే చోట కేంద్రీకృతమైంది.

"అరె ! ఈసారి బంగారు పళ్ళెం గూడా మాయమైందే ?"

"గురువుగారూ ! మన అజ్ఞానాన్ని తొలగింపజేశాడు. వాడెవడో మహా జ్ఞానవంతుడు. మనమే అజ్ఞానులం. పదండి పోదాం. ఇప్పటికీ జ్ఞానోదయం చాలు ఈ ఊళ్ళో!"

"అలా వీల్లేదు. ఆగండి స్వామీ ! మా వల్ల మీకీ నష్టం కలగడం మాకు, మా ఊరికే అవమానం. మీరు అన్యథా భావించకండి. మీ పళ్ళెం, పంచ పాత్ర వారం రోజుల్లో కొత్తవి చేయించి ఇస్తాం. మీరు మాత్రం వెళ్ళకండి."

* * *

"ఏం నారదా ! ఏమంటావ్ ?"

"నిజమే తెలిసొచ్చింది. ఇది కలియుగం. ఆ సంగతే మరిచాను. పొరపాటు పడ్డాను. బంగారు పంచపాత్ర, పళ్ళెం రెండింటినీ కొట్టేశాడు భక్తుడెవడో గాని. పాపం ఆ సన్యాసిని చూస్తే జాలేస్తోంది."

"ఆ ! ఎక్కడికి పోతాయి వస్తువులు. చూడు మన సంచిలో."

"అయ్యో ! అయ్యో ! తమరే ఇలా చేస్తే. ఇంక కంచే చేను మేసినట్లుగాదా స్వామీ ?"

ప నారదా ! ఆ రెండింటి తోనూ ఎన్ని ఊళ్ళల్లో ఇదే ఎత్తుతో ఇలా సంపాదిస్తున్నాడో నీకేం తెల్సు ?"

"అయితే స్వాముల వారు ........"

"ఇంకా అనుమానమా ! స్వాముల వారు, ఆయన శిష్య వర్గం ఒకటో నెంబరు దొంగలు."

"నారాయణ ! నారాయణ !! అయితే ప్రతిచోట ఆ వస్తువుల్ని ఎవరు తీసే వారంటారు ?"

"నారదా ! నీకు వయస్సు పెరిగింది గాని మెదడు పెరగలేదు గదా! లైట్లు తీసేది, వస్తువులు తీసేది గూడా శిష్యులే. వాళ్ళు కాకపోతే ఇంత తతంగం దేనికీ ?"

"నారాయణ ! నారాయణ !! అయితే మళ్ళీ ఇల్లా చెయ్యడంటారా ఇంకో చోట."

"తన రహస్యం ఇవాల్టితో ఇంకోడికి తెల్సిపోయిందని తెల్సి కూడా ఇంకా ఏ ధైర్యంతో చేస్తాడు ?"

"దివ్యోపదేశం ..... వస్తాను మరి. నారాయణ ! నారాయణ!!

## అనుబంధసూక్తులు

ఎ) 'దేవుని సామ్రాజ్యమైన ఈ సమాజంలో దొంగలు, వంచకులు ఏమిటి?' అని విమర్శించనక్కర లేదు. మంచీ - చెడులకు సంబంధించిన అన్ని రకాల వాళ్లూ వుంటారు. అంటే- వైవిధ్యంగా ఉండేదే ఈ విశ్వం. అయినా, దొంగలు దొంగతనం చేస్తే - ఆ దొంగల దగ్గఱ వాటా దొంగిలించే పోలీసులూ, ఆ పోలీసుల దగ్గర వారిపై అధికారులు, ఆ అధికార్ల వద్ద రాజకీయ నాయకులు, వారిపైన వారి పెద్ద నాయకుడు, ఆ పెద్ద నాయకుణ్ణి భయపెట్టి లాక్కునే విప్లవ ఉద్యమకారులు, ఆ విప్లవ ఉద్యమకారుల నుండి డబ్బు మళ్లీ కొంత ప్రజల్లోకి రావడం - ఇలా జరుగుతూఉండే ఈ జగన్నాటకంలో అన్ని రకాల పాత్రధారులుగా గూడా పాత్ర పోషణ చేస్తాడు భగవంతుడు.

బి) "టోపీ పెట్టాలనుకునేవాడికి శఠగోపం పెట్టేవాడు ఎదురౌతాడు".

"తాడిని తన్నేవాడికి - వాడితల తన్నేవాడుంటాడు"

రుద్ర నమకంలో చెప్పబడిన "తస్కరాణాం పతయే నమోనమః వంచతే పరివంచతే" అన్న మంత్రాలకిదే అర్థం.

* * *

# "నీ పాద కమల సేవయు ...."

"మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే...." ఎడమ చేత్తో గంట మ్రోగిస్తూ కుడిచేత్తో హారతి పళ్ళెం స్వామి ఎదుట ఆపాద మస్తక పరివృత్తంగా నిలువు తలంలో అవలీలగా త్రిప్పుతూ ఆలాపిస్తున్న ఆచార్యుల వారి గాత్ర శోభకు, ఆరాధనా సౌలభ్యానికి పెద్ద రెడ్డిగారు ఆనందము, ఆశ్చర్యము పొందారు. ఆచార్యుల వారిని శిష్టులలో విశిష్టులగాను, విశిష్టులలో వసిష్ఠులుగాను అనుకున్నారు రెడ్డిగారు.

ఇంతట్లో ఆచార్యులు గారు "రమా రమణ గోవిందో హరి" అంటూ హారతి పళ్ళెం ఎత్తుగా వుంచి అందరికీ చూపించగా అందరూ భక్తి శ్రద్ధలతో తమ తమ రెండు చేతులతో కర్పూర జ్వాలను కళ్ళ కద్దుకున్నారు.

పూజ పూర్తయింది. ఎవరి తాహతుకు తగ్గట్టు వారు కానుకలు, దక్షిణలు సమర్పించుకున్నారు. పెద్ద రెడ్డి గారు స్వామికి ఆభరణాలు చేయిస్తానని వాగ్దానం చేశారు. ఆచార్యుల గారు రెడ్డిగార్కి శఠ గోపం పెట్టి ఆశీర్వదించారు. తనకే గదా ఈ ఏర్పాట్లన్నీ అనో మరేమో స్వామి మోవిపై చిర్నగవు తళుక్కుమంది.

* * *

"మంగళం కోసలేంద్రాయ......"

పూజ పూర్తయింది పెద్ద రెడ్డిగారు సమర్పించిన ఆభరణాలతో స్వామి తనంత అందగాడు ఇంకోడు లేడన్నట్లు విట్ట వీగుతున్నాడు. అనుకోకుండా

పెద్ద రెడ్డి గారి ఎడమ చేయి ఆయనకుడి మీసం పైకి పోయింది. ఆచార్యుల వారి మనస్సు హరి నామ నిమగ్న మైంది. ఎప్పుడూ అడిగినట్లుగానే ఆచార్యుల గారితో "ఏమండీ ఆచార్యుల గారూ ! ఎలా వుంది సంసారం ? సాఫీగా సాగుతోందా ఒడుదుడుకులు లేకుండా ?" అన్నారు రెడ్డిగారు.

"అయ్యా ! అంతా ఆ స్వామి దయ. ఆయన నామమే నాకు, నా కుటుంబానికి రక్ష" 'హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్' అన్నారు హరి నామ నిమగ్నమైన మనస్సుతో ఆచార్యులవారు.

"నిజమే నిజమే ఆ నమ్మకం వుండాలి మరి వస్తాను" అని రెడ్డిగారు శెలవు పుచ్చుకున్నారు తీర్థ ప్రసాదాలు తీసుకుని.

* * *

"మంగళం కోసలేంద్రాయ...." స్వాముల వారికి పెద్ద రెడ్డిగార్కి మధ్య తెర సెల్లా లాగా వున్నాడు ఆచార్యులు గారు. స్వామిని కళ్ళారా చూడ్డానికి కుదరటం లేదు. చివరకు ఎలాగో అలాగు తంటాలు పడి రెడ్డిగారు అవకాశం కల్గించుకున్నారు. అనుమానమేదో వేసింది రెడ్డిగార్కి.

"ఆచార్యులు గారూ!"

"ఏమండీ రెడ్డిగారూ!"

"ఏం లేదు. స్వామి కిరీటం మరీ ముందుకు వాలి పోయేట్టుంది. కొంపదీసి పడిపోతుందేమో కాస్త సర్దండి."

"అబ్బే ! పడదండి నాకా మాత్రం తెలీదుటండీ మీరు గుర్తు చెయ్యాలా?"

"కాదు. చూడ్డానికే ఎబ్బెట్టుగా వుంది. ఫాలభాగంలోని వజ్రాల నామం మూసుకుపోలా ... సర్దండి సర్దండి."

ఆచార్యులు గారు సర్దుతున్నారు కొంచెం కొంచెం పైకి.

రెడ్డిగారు – "ఇంకాస్త పైకి ఇంకొంచెం పైకి. ఆ ! ఆగండి. అరె ! స్వామి నామం లేదేమండీ ? పెట్టలేదా ఏమిటి ? చెప్పండి అసలు సంగతి. ఇంతకీ మిగతా ఆభరణాలన్నీ ఉన్నట్టేనా ? ఏదీ ఒక్కసారి చూడండి."

"అన్నీ వున్నాయండి. ఒక్క నామం తప్ప."

"అయితే ఎవరన్నా ప్రవేశించారా మీకు తెలీకుండా గుడిలోకి?"

"లేదండీ "

"అయితే ఇది కేవలం తమరి పనేనంటారా ?"

"చెప్పాను గదండీ. హరినామాన్నమ్ముకుని బ్రతుకుతున్న వాడినని. నాకింకొకరితో ఏమి పని చెప్పండి ?"

"నమ్ముకునా ? అమ్ముకునా ?"

"తమరికి లోగడే చాలా సార్లు విన్నవించుకున్నాను 'హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్' అని. మీరు నన్ను మెచ్చుకునే వారు గూడా ఆ నా నమ్మకానికి"

"నామం అనుకుంటే నామ పారాయణం అనుకున్నాను గాని స్వామికే నామం పెట్టారనుకోలేదు. కాదు కాదు తీస్తారనుకోలేదు. ఇప్పటికైనా మించి పోయింది లేదు. ఆ నామం ఎక్కడ అమ్మారో చెప్పండి ?"

"అయన్నదక్కండి. పాపం మా నాయన కేమీ తెలీదు. మీరు తిన్నగా ఇంటికి వెళ్ళండి. అన్ని వ్యవహారాలు పరిష్కారం అయేట్టుగా నేను చూస్తాను. నామాట మన్నించాలి తమరు. గుట్టుగా సాగే సంసారాన్ని రట్టు చెయ్యకండి."

"తండ్రిని వెనకేసుకొస్తున్నావా ?"

"కాదు మన గ్రామ గౌరవాన్ని కాపాడుతున్నాను. నా మాట నమ్మండి."

"సరే ! వెళ్తాను సరిగ్గా వారం రోజుల్లో స్వామి వజ్రాల నామం ఆయన ఫాల భాగాన చూడకపోతే నీకు, నీ తండ్రికి తగిన శిక్ష విధిస్తాను.

"అలాగే తమ అజ్ఞకు బద్ధులం."

* * *

వారం రోజులు తిరక్కుండానే స్వామి ఫాల భాగాన వజ్రాల నామం తళుక్కుమంది 'రెడ్డిగారి మాటంటే మాటే ! అల్లా చెల్లాలి మాటంటే' అనుకున్నారు ప్రజలు. స్వామి కులుకుతున్నాడు మళ్ళీ తనకు తన నగవచ్చింది గదా అని. ఆచార్యుల వారికి – రెడ్డి గారి ధర్మమా అని మరోసారి ఆర్థిక రంగం మెరుగైంది.

* * *

ఆ రాత్రి రెడ్డి గారి అంతఃపురంలో .....

"...... నిజమే నాదే తప్పు. నువ్వు అడిగినప్పుడే ఆ వజ్రాల నెక్లెస్

చేయించాల్సింది. కాని స్వామిని ముందు సేవించుకున్నాను. నీ సంగతి మొదటినుండీ పట్టించుకోకపోవడం తప్పే! దానికి ప్రతీకారం తీర్చు కున్నావుగా. ఘటికురాలివి. మొత్తానికి మన ఇద్దరి వల్లా లాభం పొందారు ఆచార్యులు గారు. అదీ నిజమేలే ! ఎప్పుడూ అడగడమే గాని ఆయన్ని ఆదుకున్నదెప్పుడు నేను. ఆయన చెప్పినట్లు ఆయన హరినామమే ఆయన్ని రక్షించింది... సరే ! అవన్నీ ఎందుకిప్పుడు గానీ. ఇంతకీ దేవి గారి కాగ్రహం తొలగినట్టేనా ? అనుగ్రహం కలిగినట్లేనా ?

హరి పాద కమలసేవ చేస్తున్న ఆచార్యుల గారికి, ఆ పాదార్చకుల తోడి నెయ్యము చేసిన రెడ్డి గారి భార్యకు, నితాంత అపార భూత దయ వుండాలని తెలుసుకున్న రెడ్డి గార్కి తప్ప స్వామి ఈ లీల మిగిలిన ప్రజల కెలా అర్థం కాగలదు ?

## అనుబంధసూక్తులు

భార్యా బిడ్డల్ని పట్టించుకోకుండా - సమాజసేవ, దైవసేవ చేసి పేరుప్రతిష్ఠలు సంపాదించడానికే ప్రయత్నిస్తే - ఆ భార్యా బిడ్డల్ని ఎలా సంతృప్తిప పరచాలో యుక్తిగా వివిధ పాత్రలచే నాటకం ఆడించి, అపార్థాలను, అలజడులను సర్దుబాటు చేసే జగన్నాటక సూత్రధారుడే భగవంతుడు.



# రోగం కుదిరింది !

'నమస్కారమండీ డాక్టరు గారూ !'

'ఏమమ్మా ! ఏమిటి ? క్రొత్త కేసా ? చీటి ఏదీ ? వ్రాయించలేదా?'

'చీటీ ఏమిటి ?'

'అదే మీ బాధలన్నీ చెప్తే - కాగితం మీద వ్రాసి ఇస్తారు. అదిగో అక్కడ వ్రాస్తారు. వెళ్ళి రాయించుకురండి.'

'అబ్బే ! నాకేం జబ్బు లేదండీ !'

'మరైతే ఎవరి మందు కోసమైనా వచ్చారా ? వారి బాధలు చెప్పి చీటీ వ్రాయించండి.'

'అలాగే ! ......... డాక్టరు గారూ ! మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి ?'

'చెప్పండి'

'కొంచెం అలా లోపలకు వస్తారా ?'

'కుటుంబ సమస్యలైతే తర్వాత తీరుబడిగా చూద్దాం. జబ్బు సంగతయితే......'

'ఆ ! ఆ ! అలాంటి దే; కాస్త లోపలకు వస్తే ....'

* * *

'డాక్టరు గారూ ! మీరు చూసే ఉంటారు. ఇందాక నా వెనుక లాల్చీ వేసుకొని, భుజాన కండువా, కళ్ళజోడుతో ఎర్రగా, బొద్దుగా, పొడుగ్గా ఉన్నారే ఆయనే మా వారు'.

'ఆహా ! ఆయన్ని కూడా పిలవ మంటారా ?'

'అబ్బెబ్బే ! వద్దు వద్దు.'

'అయితే మందెవరికి ? మీ వాళ్ళ కెవరికన్నానా ?'

'కాదండీ ఆయనకే'.

'ఆయనకా ? బాగానే ఉన్నారు కదండీ !'

'ఆ ! అలానే కన్పడతారు అందరికీ! నన్నడగండి చెప్తాను ఆయన సంగతి.'

'ఏం ? హార్ట్ కంప్లైంటేమైనా ఉందా ?'

'ఆ ! ఇదో రకం హార్ట్ కంప్లైంట్ ........... చెప్పమంటారా ?'

"చెప్పండి. ఇక్కడకు వచ్చిం తర్వాత ఇంకా ఏమీ దాచకూడదు. ఉన్నది ఉన్నట్లు చెప్తేనే అసలయిన మందు పడి రోగం తొందరగా కుదురుతుంది. చెప్పండి త్వరగా."

"ఏమండీ డాక్టరుగారూ ! మీరే చెప్పండి. ఆయన ఏదీ అడిగితే అది వళ్ళు దాచుకోకుండా శ్రమపడి ఆయన క్కావలసిన వన్నీ ఏర్పాటు చేస్తుంటే ఆయన కివేం బుద్ధులు చెప్పండి..... పైగా నలుగురు పిల్లల తండ్రి ఇలాంటి వేషాలేమిటండీ ! ఇంకొకరికి నోరు విప్పి చెప్పుకోడానికి చచ్చే సిగ్గుగా ఉందండీ !"

"అసలు సంగతి చెప్పండి. మిమ్మల్ని కొడ్తారా ? తిడ్తారా ?'

"సర్లెండి. వెధవది కొట్టేనే ఇలా అయిపోయి సంసారాన్ని రట్టు చేసుకుంటానా ? మీ దగ్గరకు ఇలా పరుగెత్తుకు వస్తానా ?.... అయినా కొట్టేను తిడ్తేను లెక్కచేసే మనిషిని కాదులెండి. ఇదో మొండి ఘటం. స్వతహాగా కాస్త గుండె ధైర్యం గల మనిషిని కాబట్టి సరిపోయింది. ఇంకొకరయితే ఈ పాటికి........."

"అసలు సంగతి చెప్పండి మరి"

'ఆయన నా కన్యాయం చేశారు డాక్టరు గారూ!....'

"ఏమమ్మా ! ...... ఏమిటి ? ఛ ! ఏడుస్తున్నారా ? ఇప్పుడే గదా చెప్పారు గుండె ధైర్యం గలమనిషినని ఇంతలోనే ఇలా అయిపోతే ఎట్లా?....... ఊ, ఏం ఫర్వాలేదు నాతో చెప్పండి మీ బాధలు"

"మీరే ఈ కష్టాల్నుండి కాపాడి నా కాపరాన్ని నిలబెట్టాలి"

"ఏమైంది మీ కాపరానికి ? చెప్పండి. ఆయన మిమ్మల్ని సరిగ్గా చూట్టం లేదా ?"

"నిజం గ్రహించారు డాక్టరు గారూ ! ఎలా చెప్పాలా అనుకుంటున్నాను ఏమిటి చెప్పండి ? ఈ వయస్సులో ఆయనకు ఇలాంటి బుద్ధులు పుడ్తాయని ఎవరయినా అనుకోగలరా ? .... అదే ఆయన ధిలాసా యేమో తెలీటంలా ... వాళ్ళాఫీసులో ముగ్గురమ్మాయిలున్నారు"

"ముగ్గురేమిటి ? ఒక్కో ఆఫీసులో అందరూ అమ్మాయిలే ఉండచ్చు గూడా !"

"ఆ అందరి లాంటి వాళ్ళు కాదు లెండి ఈ ముగ్గురూ. అమాయకుల్లాంటి మా వారిని కాస్తా బుట్టలో వేసుకున్నారు. వాళ్ళు మామూలు వాళ్ళెలా అవుతారూ ?"

"అయితే ........"

"ఆయన ఆ ముగ్గుర్నీ ఉంచుకున్నారండీ !"

"ఏమిటి ముగ్గుర్నీనా ?"

"ఆ ముగ్గుర్నీ. నాకైతే మొదట్లో తెలిసిచచ్చేది కాదు. రోజు రోజుకు ఆయన వాలకం, చేష్టలు, మాటల్ని బట్టి మొత్తానికి అసలు విషయం లాగ్గల్గాను."

"ఎక్కడా మీ వారికి పని ??"

"రిజిస్ట్రాఫీసులో నండీ !"

"రోజూ ఇంటి పట్టున ఉంటారా ? లేక ఆఫీసుకని వెళ్ళి పోతూ ఉంటారా ?"

"పొద్దున్నే పదింబావు కల్లా భోజనం చేసి బయలు దేరుతారండీ "

"సిటీబస్‌లోనా ? ఆఫీసు బస్సేదైనా వుందా ?"

"లేదండీ ! ఆఫీసు దగ్గరే ! నడిచే వెళ్తారు."

"వెళ్ళి సాయంత్రం పెందలాడే వస్తారా ? చీకటి పడ్డ తర్వాత గాని రారా ?"

"అబ్బే మధ్యాహ్నం గూడా ఇంటికే వస్తారు. ఒంటి గంటంబావు కల్లా. టిఫెన్ తిని, చిన్న కునుకు తీసి రెండింటి కల్లా ఆఫీసుకు వెళ్తారు."

"అయితే మళ్ళీ ఎప్పుడొస్తారు రాత్రికేనా ?"

"లేదండీ ! ఆఫీసు ఐదుగ్గావును వదుల్తారు. ఐదుంబావు, ఐదున్నర కల్లా వచ్చేస్తారు."

"ఆహాఁ ! ఐదుంబావు, ఐదున్నర అవుతుందన్న మాట ! ... అటుపైన స్నానం చేసి బజారు కెళ్తారనుకుంటాను."

"ఆ బజారు ప్లనన్నీ మారెండో వాడే చూస్తాడు లెండి. ఆయన కంత ఓపికగ్గూడానా ?"

"మరైతే క్లబ్బుల కేమన్నా బయల్దేరతారా ?"

'క్లబ్బులంటే ఆయనకు వళ్ళుమంట"

"మరైతే ఫ్రెండ్స్ ఇళ్ళకు వెళ్తారా ?"

" ఆ ఫ్రెండ్స్‌వరో ఇక్కడకు రావడమే గాని ఈయన ఫ్రెండ్సిళ్ళకు వెళ్ళడం నేనింతవరకు చూడలా !"

"అయితే ఇంట్లోనే వుంటారా ?"

" ఆ ఇంట్లోనే. ఉన్నాయిగా ఆ గ్రంథాలు అవి తిరగేస్తూ కూచుంటారు"

"ఏం గ్రంథాలవి ?"

"ఏముంటాయి మనిళ్ళల్లో డాక్టరు గారూ ! రామాయణం, భారతం, భాగవతం ఇవేగా ! కాలక్షేపానికి వారపత్రిక కూడా కొనరు."

"అయితే మీ వారికి తప్పకుండా మందు పడాల్సిందే ! ఆయన్ని పిలుద్దామా ?"

"అబ్బే వద్దు ఆయనతో ఇలా వైద్యానికి అని చెప్పకుండా తీసుకొచ్చాను. కాస్త మందో మాకో ఇచ్చి పుణ్యం కట్టుకుందురు. చచ్చి మీ కడుపున పుడతాను."

"సరే ! ఇంత మాత్రానికేనా ? మీరు ఇంకో జన్మ ఎత్తాల్సిన అవసరం లేకుండానే మందిద్దాం. తగ్గుతుంది. అది సరే ! మీరేమిటలా నీరసంగా ఉన్నారు ? మాట్లాడుతుంటే ఆయాసపడ్తున్నట్లుంది."

"నీరసం, దడా ఉండదుటండీ ఈ వయస్సులో నా కాపరం ఇలా బుగ్గయిపోతుంటేనూ ! అన్నం సయించదు, నిద్రపట్టదు. మరి ఓపిక రమ్మంటే ఎలా వస్తుంది, దడ పొమ్మంటే ఎలా పోతుంది ?"

"మీరలా దిగులు పడ్తే లాభం లేదు. ఒక్క నెల ఓపిక పట్టండి. మీ వారిలోనూ గుణం కన్పడుతుంది. మీగ్గూడ దడ తగ్గుతుంది. మరి నా మాట విని శ్రమ అనుకోకుండా నెల రోజులు ఆయనతో పాటు మీరూ ఔషధ సేవ చేస్తే మళ్లీ ఇద్దరూ చిలకా గోరింకల్లా కాపరం నిలుపుకోవచ్చు."

"అంతకంటేనా డాక్టరు గారూ ! ఆయన మళ్ళీ మామూలు మనిషి అవాలి గానీ ఏది చెయ్యమంటే చెయ్యను చెప్పండి!"

"మరి పొట్లం ఇస్తే వేసుకుంటారా ఆయన ?"

"ఔనండోయ్ వేసుకోకపోవచ్చు. నాకు జబ్బేమిటి ? నీకేమైనా మతి పోయిందా అని గూడ అనచ్చు. మరెలా ? చెప్పండి అది గూడా మీరే"

"మీ వారు కాఫీ ఎప్పుడు త్రాగుతారు ?"

"అసలు ఆయన కాఫీ త్రాగరు. పాలే త్రాగుతారు."

"అయితే ఈ సారి మీరాయనకు పాలిచ్చేటప్పుడు ఆ మందు కలిపి ఇవ్వండి. దివ్యౌషధం అవుతుంది అంతే !"

"మోసం అవుతుందంటారా ?"

"అల్లాఅనుకొంటే మీరిలా ఆయనతో రావడమే మోసం.... పొద్దున్న లేస్తే పిల్లల దగ్గర ఎన్ని ఇలాంటి నాటకాలాడం మనం ? అవన్నీ మోసాలనుకుంటే ఎలా ? జబ్బు నయమవడమే ప్రధానం. ఎన్ని నాటకాలయినా ఆడచ్చు. తప్పు లేదు ... అంతగా మీకది పాపం అనిపిస్తే నాకు వదిలెయ్యండి. పాపాల భైరవుణ్ణి, భరిస్తాను మీకేం అంటకుండా!"

"ఇంకా నయం, మీరంతగా చెప్పిం తర్వాత అర్థం కాలేదనుకోబోకండి. రోజూ మీరు చెప్పినట్లే చేస్తాను."

"మందు ఇద్దరికీ ఇవాళే ప్రారంభిద్దాం. మరెందు కింక ఆలస్యం?"

* * *

"ఎలా ఉందమ్మా ఆయనకు"

"డాక్టరు గారూ ! మందు బాగానే పనిచేస్తున్నట్లుందండీ ! మునుపటి కంటె చాలా నయం. ఇది వరకు అనుమానించాల్సినంతగా ఇప్పుడు లేదు. మీరు పొట్లం ఇచ్చి ఒక్కవారం రోజులాగి చెప్పమన్నారు. ఈ వారం రోజుల్లోనే ఇంత గుణం కనపడుతుందనుకోలేదు సుమండీ ! మూడో వంతు తగ్గి నట్లేనండి !"

"మీకెందుకు మరో రెండు డోసుల్తో ఆ మిగతా రెండొంతులు తగ్గిపోతుంది. కంగారు పడకండి. పద్దవి మూడుముళ్లు గదా! ఒక బంధం ఊడింది. మిగతా రెండు బంధాలు ఊడి మీ సంబంధం ఒక్కటే మిగుల్తుంది. ఇదిగో ఈ రెండు పొట్లాలు రెండు వారాల్లో వేసి చెప్పండి. నేనిది వరకు చెప్పినట్లుగానే అన్నీ. అన్నట్లు మీ ఆరోగ్యం విషయం చెప్పారు గారు. నాకు మాత్రం చాలా మార్పు వచ్చినట్లు కన్పడుతున్నారు. నిద్ర బాగా పడుతోందనుకుంటాను."

"ఆహా ! ... లోగడ ఊరికే వెర్రి ఆలోచనలు, అయిందానికి, కానిదానికీ ! ఇప్పుడవన్నీ తగ్గి కడుపునిండా తిండి, కంటి నిండా నిద్రా పడుతున్నాయి. నా పని చాలా మెరుగైందనే చెప్పాలి. ఏమైనా మనస్సు బాగు పడాలి ముందు, మీరు చెప్పినట్లు. వస్తానండీ నమస్కారం. ఈ పళ్ళు, పువ్వులు పిల్లలకివ్వండి."

"ఎందుకైనా మంచిది, మరో రెండు డోసులు ఈ రెండు వారాల్లోనూ మీరు కూడా వేసుకోండి పూర్తి స్వస్థత చేకూరుతుంది."

* * *

"రక్షించారండి ! నిజంగా రోజూ నరకంగా వుండేది ఇంట్లో. మీరు నాకు బాగా తెలుసునని దానికి తెలీదు పాపం. మన మనుకొన్నట్లుగానే జరిగింది కథమొత్తం. ఏమైనా "హయెస్క్యామస్" ఇంత బాగా పనిచేస్తుందనుకోలేదు. ఇప్పుడు ప్రాణం హాయిగా వుందండి బాబూ!" మీకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు అంటూ లాల్చీ, కండువా, కళ్ళజోడు వ్యక్తి వందన సమర్పణ చేశాడు."

"ఉంటుంది. ఉంటుంది. మరి కాసిని షుగర్ పిల్స్ రోజూ పుచ్చుకుంటే సరి ! పాపం ! ఈ మూడు వారాల్లోనూ ప్రాణం అలవాటుపడి ఉంటుంది" అంటూ డాక్టరు గారు ప్రిస్క్రిప్షన్ కంటిన్యూ చేశారు.

## అనుబంధసూక్తులు

'అనుమానం' అనే కేవలం మానసిక రుగ్మతతో అయిన వారిని వేధించి, ఇంట్లో నరకాన్ని సృష్టించే వారిని – ఎలా యుక్తిగా మాటలతో సామోపాయంతో సంసారాలలోని అవకవతలను సరిదిద్దవచ్చునో సన్నివేశాల ద్వారా తెలియచెప్పే వాడే భగవంతుడు.



# "యోగః కర్మసు కౌశలమ్"

్రమతికి,

నీవు క్షేమంగా చేరినట్లు వ్రాసిన ఉత్తరం అందినది. నీవు వెళ్లిననాడు, ఆ మరునాడు శ్రీవారు చెయ్యి కాల్చుకున్నారు. అందుకే అక్షరాలు ఇలా అఘోరిస్తున్నాయి. పప్పు చేసుకున్నాను. కంచం కాబట్టి సరిపోయింది. విస్తరైతే సగం నేలపాలయేది. బుద్ధొచ్చింది. ఇంకెప్పుడూ ఈ పప్పు (తప్పు) చెయ్యనని లెంపలేసుకున్నాను. అన్నం కట్టుడు సున్నం పాకంలో తయారైంది. కట్టుడు పళ్ళ వాళ్ళెవరైనా వుంటే కాస్త సదుపాయంగా వుండేదేమో ! తొలి నాడిలా గడిచింది. మరునాడు కూర లావణ్యంగా వుంది. చారు చూస్తేనే విచారమేసింది. ఇంక త్రాగితే గ్రహచార మెలా మారుతుందో ననిపించి ధైర్యం చెయ్యలేదు అంతే ! దాంతో స్వయం పాకానికి స్వస్తి చెప్తాను. హోటలు వాళ్ళకు బకాయి పడ్డ పాతజన్మ తాలూకు ఋణం తీర్చుకోడం మొదలు పెట్టాను. కాని నాలుగైదు రోజులైం తర్వాత గాని తెలీలేదు వాడు పెట్టేది భోజనం కాదు, గడ్డి అని. దాన్ని మేయలేక నిన్న రాత్రి స్వాముల వారు పళ్ళూ, పకోడీలు సేవించారు. ఇదీ ఇక్కడి పరిస్థితి. నువ్వొచ్చేటప్పటికి ఎలాగో అలా తంటాలు పడి నువ్వు గుర్తుపట్టి నా – నన్ను పిల్లలు గుర్తు పట్టరేమో నన్నదే నా భయం. ప్రస్తుతం బాధలు ఇంతే ! పిల్లలిద్దరికీ నా ముద్దులు అందజెయిఇ్య వుండనా మరి !

నీ

...........

శ్రీవారికి,

వారం కూడా సరిగ్గా తిరక్కుండానే ఆఫీసు గొడవల్లో సతమతమౌతూ కూడా శ్రీవారికి నేను గుర్తు వచ్చినందుకు నన్ను నేనే అభినందించుకొని, అలాంటి మిమ్మల్ని వంటరిగా వదలి వచ్చినందుకు నిందించుకున్నాను. మీరు నేను చెప్పినట్లు చేస్తే కొన్ని ఇబ్బందులు తప్పుతాయి. 1) హోటలు కూడు మానెయ్యండి. వాడు పెట్టేది భోజనమా ? గడ్డా ? అనే మీ మాంసలో పడి మీ బుట్టపాడు చేసుకోకండి అదీ కాక నిన్న నాకు ఒక కలవచ్చింది కలలో మీ హోటలు యజమాని కన్పడ్డాడు. మీ క్రిందటి జన్మ తాలూకు బకాయి బాకీ తీరినట్లుగా మీకు గుర్తు చెయ్యమన్నట్లు గుర్తు. అందుకని ఇక హోటల్ మానెయ్యండి. 2) పట్కారు, కాగితాలు లేదా గుడ్డల సహాయముతో చెయ్యి కాలకుండా వంట చేసే ప్రయత్నం ఆరంభించండి. ఎందుకంటే ఈ సారి నిజంగా చెయ్యి కాలితే నాకు వ్రాసే ఉత్తరాలలో లోపల ఉత్తరంతో పాటు అడ్రసు గూడ చిక్కిరి బిక్కిరిగా వ్రాయవలసి వస్తుంది. క్రిందటిసారి పాపం అడ్రసు అందంగానే వ్రాసారు పొరపాటున ! 3)వంటింట్లో అలమారలో ఒడియాలు, అప్పడాలు, కందిసున్ని, దోసఒరుగులు, ఊరగాయలు వున్నాయి. బద్ధకించినపుడు వాటితో కాలక్షేపం చెయ్యండి. ఏం చేస్తాం ! 'ఒకచో శాకము లారగించు నొకచో నుత్కృష్టశాల్యోదనంబు' అన్నారు. టిఫిన్‌కు జంతికలు, చేగోడీలు, మినప సున్నిగూడా స్టీలు డబ్బాలో పెట్టే వచ్చాను. అయినా మనం క్రొత్తగా కాపరం పెట్టిన రోజుల్లో వంట మీదగ్గరే గదండి నేను ట్రైనింగ్ పొందింది. మర్చిపోయుంటారు పాపం ! చేపపిల్లకు ఈత నేర్పాలా? నేనేదన్నా ఇప్పుడు

వంట గురించి మీకు చెప్తే గ్రుడ్డొచ్చి పిల్ల నెక్కిరించి నట్లుంటుంది. అనవసరంగా వంటరాదని ఆత్మ వంచన చేసుకోవడం మూలంగా మీకేమి ఒరిగింగ్ ెప్పండి ? ఈ సారి మీ. శాకపాక వర్ణనలతో వ్రాసిన ఉత్తరాన్ని ఎదురు ంస్తాను. ఈ నెలాఖరుదాకా ఈ ఊళ్ళో వుందామనుకున్నాను. అంటే ఇంకా ఇరవైరోజులు. అయినా మీరక్కడ ఇబ్బంది పడ్తున్నారు గాబట్టి నా క్యాంప్ పదిరోజులకు తగ్గించుకుంటాను. చూడాల్సిన చుట్టాలు బోల్డుమంది వున్నారు. మన బాబు గాడి పురిటికి రావడమేగా ఈ ఊరు. చాలా రోజులైంది. అందర్నీ చుట్టెయ్యేద్దూ వచ్చినందుకు. పిల్లలిద్దరూ కులాసా. వాళ్ళకి మీ ముద్దులందించడంలో కొంత మోసం జరిగింది. ఉత్తరం వ్రాయడం మరువకండేం !

మీ.

..................

శ్రీమతికి,

నీ సందేశ, ఉపదేశాత్మక మైన లేఖ అందినది. నీ సలహా వల్ల ఉపయోగం కన్పడింది. హోటలు మానేశాను. ఇంట్లోనే ఎలాగో తంటాలు పడ్తున్నాను. నారు పోసిన వాడు నీరు పొయ్యడా అనుకున్నాను. అంతే ! నా యాతన చూడలేక మన ప్రక్కింటివారు, ఇంటివారు, కూరలు పులుసులూ అడపా దడపా ఇస్తూనే ఉన్నారు. కాని నువ్వు ఎప్పుడు వస్తావని అడుగుతున్నారు. అంటే మాకెన్నాళ్ళీ బాధన్నట్లు నాకనిపించింది. ఒకసారి ఇవ్వడం మొదలు పెట్టిన తరువాత వాళ్ళు అధాత్తుగా మధ్యలో మానలేరు

గదా ! మనం వాళ్ళ నిబ్బందిపెట్టడం సబబు గాదనిపించింది. వద్దన్నా మానడం లేదు. నువ్వు చెప్పిన గడువు గూడా పూర్తవుతోందిగాబట్టి తొందరగా వచ్చేసెయ్యి. వచ్చే ముందు వైరియ్యి. స్టేషన్ కు వస్తాను. అమ్మాయికి పాఠాలు చెప్తూ వుండు. ఇంతకన్న సంగతులు లేవు.

నీ

.................

శ్రీవారికి,

నేననుకొన్నట్లుగా పదిరోజులవంగానే వచ్చేద్దామనుకొన్నాను. కాని నాల్గు రోజుల్లో మా తాతగారి తద్దినం. అమ్మా నాన్న బలవంతం చేస్తున్నారు. ఇన్ని రోజులు గడిపినవారు ఈ నాలుగు రోజులు నా కోసం త్యాగం చేయలేరా! మీరే చెప్తూ ఉంటారు. "త్యాగే నైకే అమృతత్వ మానశుః" అని. మరి ఇలాంటి అవసరాలు వచ్చినపుడే ఆచరణ జరగాలి. వట్టి శుష్కోపన్యాసాలవలన ఏం ప్రయోజనం చెప్పండి? మీ రెండవ ఉత్తరంలో అక్షరాలు ముత్యాల్లా ఉన్నాయి. కాలిన చెయ్యి పూర్తిగా నయమై ఉంటుంది. అంతేనంటారా ? ఏమైనా మీ బుఱ్ఱను ఇన్సూర్ చేయించాలండీ ! కాని, మీతో నేను ఎనిమిదేళ్ళు కాపరం చేశాను. ఆ విషయం మరువకండి, మరి ఉంటాను.

మీ

............

శ్రీమతికి,

చెయ్యి కాల్చుకున్నానంటే నువ్వు వాచ్యార్థాన్ని తీసికొని అనవసరమైన విమర్శ చేశావు. లక్షణార్థాన్ని గ్రహిస్తావనుకున్నాను గాని, ఇల్లా వ్యంగార్థాన్ని గూడా సృష్టిస్తావను కోలేదు ! సరే ! నువ్వు వ్రాసిన ఉత్తరంలో ప్రకారమే నాలుగురోజులాగిరా ! నీ ముచ్చటకు మధ్యనేనెందుకు అడ్డురావాలి. అన్నట్లు వ్రాయడం మరిచాను. ఈ మధ్య లోగడలా బోర్ కొట్టడం లేదు. ఇంటివాళ్ళ తాలూకు ఒక అమ్మాయి వచ్చింది. ఎంత చిలిపిదో చెప్పలేం. ఇదివరకటి కంటే ఇప్పుడు కాస్త తోస్తోంది. నువ్వు ఆ నాలుగురోజులూ ఆగి తాతగారి తద్దినం అయింతర్వాతనే రా ! అన్నట్లు నీకు ఇబ్బంది రోజులు కదూ ! ఇబ్బంది రోజులు తీరిన తర్వాతనే వస్తే మంచిది. లేకపోతే ఇన్ని రోజులూ అక్కడ ఉండి సరిగ్గా ఆ రోజుల్లో ఇక్కడ కెందుకు ? మరి ఉంటాను.

నీ

..........

శ్రీ వారికి,

మీరు నాయందు ప్రసన్నతతో వ్రాసిన ఉత్తరం అందింది. ఉత్తరంలో వ్రాసిన ప్రకారమే చేస్తాను. ఎందుకో ఈసారి ఇంకా ఇబ్బంది రోజులు తీర లేదు. (భయపడకండి !) కాని, ఎందుకో నాకే వచ్చేద్దామనిపిస్తోంది. మనస్సు ఆగడం లేదు. కాని నిజానికి మీరు చెప్పినట్లు అయిం తర్వాత వస్తేనే బావుంటుంది. ఏం చెయ్యడానికి పాలు పోవడం లేదు. మీరు మీ స్నేహితులతో కాలక్షేపం చెయ్యండి. ఇంటి వద్ద బోర్ కొడ్తుంది కాబట్టి

అలా చేస్తేనే బావుంటుందని వ్రాశాను. మా పిన్ని గారమ్మాయి పెళ్ళి నిశ్చయమైంది. ఆ పెళ్ళవంగానే వచ్చేస్తాను. ఆరోగ్యం జాగ్రత్త !

మీ

.......

శ్రీమతికి,

నీ ఉత్తరం అందింది. ఇన్ని రోజులకు మీ పిన్ని గారమ్మాయి పెళ్ళి నిశ్చయమైంది. నువ్వూ, ఆ అమ్మాయి బెస్ట్ ఫ్రెండ్స్ గదా! పాపం ! ఆ అమ్మాయి పెళ్ళికి తప్పకుండా ఉండిరా ! ఉండకపోతే బాధపడ్తుంది. నా సంగతి అంటావా ఇన్ని రోజుల్నుండి అలవాటు పడ్డాను గదా ! ఎలాగో అలా సర్దుకుంటాలే ! అయినా ఈ మధ్య కాలక్షేపం బాగానే జరుగుతోంది. మునుపటిలా బోర్ ఫీలవడం లేదు. శాంతి చాలా మంచిది. ఎప్పుడూ నవ్వుతూ కబుర్లు చెప్తుంది. నవ్విస్తుంది. మొన్ననే ఇద్దరం సినిమాకు వెళ్ళాము. నిన్న బజారు వెళ్లినపుడు మన పాపాయికి గౌను సెలక్టు చేసి పెట్టింది. నిజంగా శాంతి ఉంది గాబట్టి సరిపోయిందిగాని లేకపోతే పిచ్చెక్కి పోయేదనుకో ! నీవు అన్నీ ముగించుకొనిరా ! హడావుడి పడకు పిల్లల కాశీస్సులు.

నీ.

.........

"ఏమండీ ఇల్లు తాళం వేసుంది. ఆయన ఊళ్ళోలేరా ?"

"అయ్యో ఊళ్ళోనే ఉన్నారమ్మా ! ఆయన, మా శాంతి సినిమా కెళ్ళారు"

"ఆహా ! నాకేం తెలుసు ? ఆఫీసు వేళ కాదుగదా, ఇంట్లోనే ఉంటా రనుకున్నాను."

"అదేమిటి అంతా హఠాత్తుగా వచ్చావు. స్టేషన్‌కు రమ్మని వైర్ ఇవ్వలేదా ఆయనకు?"

"అధాత్తుగా వచ్చి ఆయన్ని, మిమ్మల్ని ఆశ్చర్యంలో ముంచుదామని అలా చేశానండి. నిజమే! వైర్ ఇస్తే బాగానే ఉండేది. కాని ...... ఇలా వస్తే ఆయన ముఖం ఎలా ఉంటుందో చూడొచ్చుగా ! అందుకని"

"అలాగా ! ఇద్దరికీ ఇద్దరే ! తగిన వాళ్ళని కుదిర్చాడు ఆ భగవంతుడు. ఇదిగో తాళం చెవి. సరే ! అన్నం వండే ప్రయత్నం చెయ్యబోకు నువ్వూ పిల్లలూ గూడా ఆయన్తో పాటే మా ఇంట్లోనే భోజనం చేద్దురు గాని."

"ఆయన అన్నం గూడా మీ ఇంట్లోనే తినడం మొదలెట్టారన్న మాట !"

"అబ్బే లేదమ్మా ఇవాళొక్కరోజే! వచ్చేటప్పటికి పదవుతుంది గదా ! మా ఇంట్లోనే ఇద్దరూ తిందురు గాని అని నేనే పిల్చాను."

* * *

"అబ్బ, ఇల్లు ఎలా ఉందో ! ఆడవాళ్ళు లేకపోతే ఈ మగాళ్ళింతే. డబ్బంతా సినిమాలకు, షికార్లకు తగలేస్తున్నారల్లే ఉంది. పెళ్ళికి ఉండకుండా పరిస్థితి విషమించక ముందే తొందరగా వచ్చేయ్యడం మంచిదైంది."

* * *

"హలో ! శ్రీమతి గారెప్పుడో వచ్చారే, చుక్క ఊడిపడ్డట్టు. ఏరి మన సంతానం కన్పడరే ! అప్పుడే పెత్తనాని కెళ్ళారా ఏమిటి ?"

"తమరు సినిమా మానుకొని మరీ వచ్చేశారే ! టెలీపతిగ్గా నే వచ్చినట్లు వార్తందిందా ఏమిటి ? అది సరే మీరొక్కరే గాదుగా వెళ్ళింది. మరి ఒక్కరే వచ్చారే ?"

"ఆంటీ ! ఇదిగో పూలు. అంకుల్ కొన్నారు. సినిమా కెళ్తే అందలేదు. ఆలస్యమైంది. పార్కుకెళ్ళి అంకుల్, నేను పూలుకొనుక్కుని ఇంటికొచ్చేశాము. ఆంటీ పిల్లలేరీ ?"

"అదేమిటి అలా నుంచుండి పోయావ్ ? ఈ పిల్లే శాంతి. నేను ఉత్తరంలో వ్రాయలేదూ !"

"ఈ చిన్న పిల్లేనా ఆ శాంతి ?!!"

## అనుబంధసూక్తులు

లాజికల్‌గానే కాకుండా - మ్యూజికల్‌గా గూడా చెప్పగలగడం, సూటిగానే కాకుండా - స్వీట్‌గాగూడా చెప్పగలగడం, కుండబ్రద్దలు కొట్టకుండానే - నిజం మాట్లాడగలగడం, నిపుణతతో బాధ్యతలను నిర్వర్తించడం, సమస్యలను కుశలత్వంతో పరిష్కరించుకోగలగడమే యోగం.

❀❀❀

# మోక్షప్రాప్తి

పత్ర, ఫల భక్షణం మాత్రమే చేస్తూ, పంచాగ్నుల మధ్య, పైకెత్తిన హస్తాంజలితో, పాదాంగుష్ఠాన్ని నేల మోపి, యావచ్ఛరీరం భస్మధారణతో ఉద్ధృతంగా తపస్సు కొనసాగిస్తున్న మహోగ్ర స్వరూపం కన్పడగానే నిరంతర నారాయణ స్మరణానందాన్ని అనుభవిస్తూన్న నారదుడికి గూడా మతి పోయింది. ముచ్చట వేసింది. "ఎన్నాళ్ళ కెన్నాళ్ళ కిలాంటి దృశ్యం చూడగల్గాను" అని అనుకున్నాడు - మొహం వాచిపోయినట్లు. 'ఇలాంటి మహానుభావులు ఇంకా భూమ్మీద ఉండడం వల్లనేగదా ఈ భూమి ఇలా ఈ మాత్రం నిల్చిందంటే' అని అనుకుంటూ నారదుడు దగ్గరకు రాబోయేసరికి మహోగ్ర స్వరూపం మందంగా కదిలింది. మరి కాస్సేపట్లో మరి కొంచెం మెదిలింది. పాదం పూర్తిగా నేల కాన్చి, హస్తాంజలి విడిదీసి, కరాలను స్వస్థలాలకు చేర్చి, కళ్ళు తెరిచాడు తపస్సంపన్నుడు.

"ఎవరూ ?"

"నేనే నారదుణ్ణి".

"అబ్బా నా జన్మ ధన్యం. నా కృషి ఫలించినట్లే. బహుశా బ్రహ్మేపంపించి వుంటాడు. సందేహం లేదు. అవునా ?"

"అబ్బే ! నేను అక్కణ్ణుంచి రావటం లేదు."

"అయితే పరమేశ్వరుడు పంపించి వుంటాడు."

"అబ్బే లేదు"

"అయితే మరెవరు పంపించారో చెప్పరాదూ నన్నూనటించకుండా"

"ఎవ్వరూ పంపలేదు"

"అయితే ప్రస్తుతం ఎక్కడ నుంచి ఎక్కడ కెళ్తున్నట్లు?"

"పాతాళం నుండి వస్తున్నా, పరంధాముడైన ఆ పద్మనాభుని దర్శించటానికి వెళ్తున్నాను."

"అయితే ఒక్క సహాయం చేసి పెట్టాలి."

"ఏమిటది ? నా చేత నైతే తప్పకుండా చేస్తాను"

"ఏమీ లేదు. నేను ఐదేళ్ళ బట్టి ఈ తపస్సు ఇలా తీవ్రంగా కొనసాగిస్తున్నాను. అయినా ఆ పరమేశ్వరుడు గుర్తించినట్లు లేదు. బొత్తిగా పరాగ్గా వున్నాడు నాపట్ల. నా శ్రమను, నా తపస్సును, నా ఈ సంగతి నంతా వివరంగా చెప్పి, నా సంగతే మన్నా ఆయన ఆలోచనలో వున్నదీ లేనిదీ తెలుసుకొని, నా కెప్పుడు మోక్షం వస్తుందో కూడా తెలుసుకొని, ఈ సారి ఇలా వచ్చినప్పుడు నాకు చెప్పి పుణ్యం కట్టుకోవాలి. అదొక్కటే నేను కోరే సహాయం."

"ఓస్ ఇంతే గదా ! అలాగే " మరి వస్తాను కాని నే వచ్చేవరకు ఈ ప్రయత్నం విరమించుకుండా ఇక్కడే ఇలాగే కొనసాగించడం మరచి పోవద్దు. వస్తాను మరి. నారాయణ ! నారాయణ !"

"సాములు సాములు"

"ఏమిటలా రొప్పుతూ వచ్చావు నీకేం కావాలి ?"

"ఏం లేదు బాబయ్యా ! ఆయన సంగతి కనుక్కోడానికి మీరెలాగూపై కెళ్తుండారు గాబట్టి పన్లో పని నా పని కూడా కాస్త చేసి పెడ్తారా ?"

"కాస్తేం ఖర్మ పూర్తిగా చేసి పెట్తాను. ఏమిటో చెప్పు."

"అదే, ఆ మోచ్చం. మరి నాకెప్పుడొస్తాదో అది గూడా కనుక్కొత్తారా? మీరు వచ్చేదాకా ఎదురుచూస్తా వుంటాను. అదిగో ఆ ఆవుల్ని గేదెల్ని మేపుకుంటూ ఈ వేణు వూత్తూ ఈడనే వుంటాను. మర్చిపోకండి సాములూ"

"అబ్బే ఎందుకు మర్చిపోతాను. నీ సంగతి కూడా విచారించి ఈ సారిలా వచ్చినప్పుడు తప్పకుండా చెప్తాను. సరేనా ? మరి నే వస్తా"

"బాబ్బాబు ! ఆ సహాయం చేసి పుణ్ణెం కట్టుకోండి !"

"నారాయణ ! నారాయణ !"

* * *

"నారాయణ ! నారాయణ !

"అభ్బా ఎప్పుడో దిగినట్లున్నారే. మరి నా సంగతేమిటి ? కాయా పండా ?"

"తొందరపడకు"

"అబ్బో ఎప్పుడో వచ్చేసినారే సాములు"

"నువ్వూ వచ్చేసావే సమయానికి. ఉండండి. మరైతే ఇద్దరూ సావధానంగా వినండి"

"చెప్పండి చెప్పండి"

"నాయనా ! నువ్వేగా ఐదేళ్ళ బట్టి పంచాగ్నుల మధ్య తపస్సు చేస్తున్నావు"

"అవును"

"మరి నీకు మరొక్క ఐదేళ్ళలో మోక్షం ప్రాప్తిస్తుంది"

"ఆ ఇంకా ఐదేళ్ళా ! అన్యాయం, అక్షరాలా అన్యాయం"

"ఆగు మరి తొందరపడకు ! ఆ ఇంక ఆ పశువుల కాపరి సంగతి. చూడు, ఆ మఱ్ఱిచెట్టు వుందే దాని మీద ఎన్ని ఆకులున్నాయో అన్ని జన్మల తర్వాత నీకు మోక్షం ప్రాప్తిస్తుంది.

"అబ్బ ఎంత సల్లంగా చెప్పావయ్యా సాములూ అయితే నాయీ బతుక్కి మోచ్చం వుండాదన్నమాట ! పోన్లే ఎన్ని జనమలైతేనేం నాకు మోచ్చం వస్తాదంటేనే నా వళ్ళు పొంగిపోతుండాది".

"ఐదేళ్లు వళ్ళు దాచుకోకుండా నానా హైరాణా పడి పత్ర ఫల భక్షణం మాత్రమే చేస్తూ వుంటే మొహం లేవలేదన్నమాట. ఇంకా ఐదేళ్ళు ఆగాలా? ఏమన్నా ఇది న్యాయంగా వుందిటయ్యా ? లెక్కలు రాకపోతే మానె, ఎవరెంత సాధన చేస్తున్నారో, ఎంత ప్రావీణ్యులో కూడా గుర్తించలేనివాడేమిటి మీ దేవుడు. నే నొప్పుకోను ? ఇది ఆయనకు తగదని చెప్పు. అయినా నాకెందుకో అనుమానంగా వుంది. నువ్వేమన్నా పొరబడ్డావేమో ఇంకొకరెవరి సంగతన్నా అయి వుంటుంది ఇంకోసారి వెళ్ళి కనుక్కోరాదూ, సందేహం తీరుతుంది".

"ఆ ఆ ఇలాంటి మాట పడాల్సి వస్తుందేమోనని ఎందుకైనా మంచిదని చెప్తూ వుండగా వ్రాసుకొచ్చాను. ఉండు ఎందుకొచ్చిన సందేహం. వ్రాసుకొచ్చింది చదువుతా. మీరేవిందురు గాని ..... అయ్యో! అయ్యో ! కొంప మునిగింది".

"ఏమిటయ్యా ! చదువు బిగ్గరగా ! నీలో నువ్వే చదువుకుని కొంపమునిగిదంటావేం ? నాకు తెలుసు నువ్వు ఇలాంటి పొరపాట్లు చేస్తావని. ఇలా ఇవ్వు, నేనే చదువుతాను".

"నిజమే తప్పు చెప్పాను. మీ ఇద్దరివీ ఒకళ్ళకు చెప్పాల్సింది ఇంకొకళ్ళకు చెప్పాను. చూడండి మీరే !"

" ఆ! ఆ! ఎంత ఘోరం ఐదేళ్ళు గూడా కాదు అన్ని జన్మలా నాకు మోక్షం రావాలంటే ! ఈ అన్యాయాన్నిలా చూస్తూ వూరుకుంటే లాభం లేదు. అసలు నువ్వే ఏదో పుల్లవేసుంటావు. నా తపస్సు చూడలేక అసూయ పడి ఉన్నవి లేనివి కల్పించి చెప్పుంటావు. నీ సంగతి చూడాలి ముందు"

* * *

"ఏమిటి గురూ ! నా సంగతి చూడాలి ముందు అంటున్నారు నిద్రిస్తూనే".

"నీ సంగతి కాదురా శిష్యా"కల్లో నారదుడి సంగతి. దిక్కుమాలినకలొకటి వచ్చిందిలే ! ఓ అర్థం పర్థం వుండవు ఈ కలలకు"

"అలా అనకండి గురూ ! తమ తోటి పెద్దలకు వచ్చినవి అందులోనూ తెల్లవారుతుండగా వచ్చినవి అబద్ధం కావులెండి. నిజాన్నే సూచిస్తాయి. లెండి ! తపస్సుకు వేళైంది పోదాం రండి".

"అం ఏం తపస్సులే ! లెక్కలు తెలీని దేవుణ్ణి మ్రొక్కడానికి మనస్కరించడం లేదు. నువ్వు పో"

"అయితే ఆ దేవుణ్ణే లెక్క చెయ్యరన్నమాట ! సరే ! నే పోయి నా తపస్సు కొనసాగిస్తాను.

## అనుబంధసూక్తులు

లెక్కలతోను, భక్తి అని మభ్యపెట్టే వెట్టి చేష్టలతోను భగవంతుణ్ణి ప్రసన్నం చేసుకోవడం కుదరదు. నిదానం, ఓర్పు, నిరీక్షణ, ఆర్తి, నమ్మకం, సంతృప్తి, సత్ప్రవర్తన, శ్రద్ధ అనేవే మోక్షప్రాప్తికి కావలసిన లక్షణాలు.



# తరణోపాయం

ఇస్త్రీ చేసిన ఖద్దరు పైజమా, అదే రకం లాల్చీతో, కాళ్ళ చెప్పులు చేసే చప్పుడుతో, దానికి తగ్గట్టు తాళం వేసే చేతికర్ర టిక్ టిక్ ధ్వనులతో, బరువైన బొజ్జతో, రిటైరయ్యేప్పటికి బట్టతలపై మిగిలిన నాల్గు వెంట్రుకలతో ముక్కుపైకి కొద్దిగా జారిన నల్లఫ్రేమ్ కళ్ళజోడుతో, గున్న ఏనుగులా గుర్నాథం గారు ఊరికి దూరంగా ఉన్న ఏటి గట్టమ్మటే నడుస్తున్నారు. ఇంకా సూర్యుడు పశ్చిమాన దిక్చక్రానికి కొంత ఎత్తులోనే వున్నాడు. సన్నగా వేణునాదం విన్పిస్తోంది. ధ్వని దిక్కుగా గుర్నాథం గారి మెడ తిరిగింది. వెళ్ళగా వెళ్ళగా ఒక కుర్రవాడు వేణువు ఊదుతూ కన్పించాడు. దగ్గరగా వెళ్ళారు గుర్నాథం గారు.

కుర్రవాడు గమనించలేదు ఇంత పెద్దరిటైర్డు ఆఫీసర్నీ !

"ఏరా ఏమిటి ? వళ్ళు తెలీకుండా పాడేసుకుంటున్నావ్?"

"................"

"ఒరేయ్ నిన్నేరా అడిగేది"

"ఏమిటి బాబయ్యా మీరడిగేది !"

"అదేరా నీలో నువ్వే ఒళ్ళు తెలీకుండా పాడేసుకుంటున్నావ్....... ఏ పనీ లేదా నీకు ?"

"తమరు పనిలేకనే ఇలా వచ్చారా బాబూ?"

"లేకపోవడమేమిటిరా ! నేనెన్నెన్ని చేశానో, ఎంతెంత శ్రమపడ్డానో నీకేం తెలుసు ?"

"చెప్పండి బాబూ వింటాను"

"అదంతా పెద్ద గ్రంథం వ్రాయచ్చు. చెప్తే తేలేదా ?"

"పర్లేదు చెప్పండి బాబూ వింటాను."

"టూకీగా చెప్తాను విను నీకే తెలుస్తుంది ఆపైన".

"చాలా చిన్నతనంలోనే పెళ్ళైంది నాకు. అటుపైన ఉద్యోగం, మరి కొన్ని రోజులకు ప్రమోషన్ అంటేపై ఉద్యోగం వచ్చిందన్న మాట ! నలుగురు పిల్లలు. ఇద్దరు మొగపిల్లలు ఇద్దరు ఆడపిల్లలు. అందర్నీ పెంచి పెద్దవాళ్ళను చేసి చదువులు చెప్పించాను. ఆడపిల్లలు కాపరానికి వెళ్ళారు. కోడళ్ళు కాపరానికొచ్చారు. తాత గార్నయాను. బారసాలలు, అన్నప్రాశనలు, ఉపనయనాలు, పెళ్ళిళ్ళు ఇంకా ఎన్నో నా చేతిమీదుగా జరిగాయి. స్వంత ఇల్లు కట్టుకున్నాను. ఉద్యోగంలో రిటైరయాను. సాయంకాలం ఇంట్లో బయల్దేరి ఇలా వచ్చాను."

"మరి ఇక్కడ ఏముందని వచ్చారు ?"

"ఈ మధ్యనేగద రిటైరైంది. ఇంటివద్ద ఏమీ పని లేదు. పైగా తోచదు, ఇల్లంతా ఒకటే గందరగోళంగా వుంటుంది. ఎవడి పన్లో వాళ్ళుంటారు. ఎప్పుడు చూసినా అందరూ హడావుడిగా వుంటారు. చెప్పొద్దూ బొత్తిగా ఇంట్లో ప్రశాంతి లేదనుకో! హాయిగా ఇలా ఏటి గట్టమ్మటే వచ్చి కాస్త స్వచ్ఛమైన గాలి పీలుస్తూ ఆనందంగా గడుపుదామని వచ్చాను".

"అయితే ఇంత కష్టపడింతర్వాత, ఇన్నాళ్ళకు మీకు అసలైన సుఖమూ, శాంతి ఆనందము ఇక్కడ వున్నాయని తెలిసింది. కాని, నేను మొదట్నుంచీ ఈ వాతావరణంలోనే జీవితాన్ని గడుపుతూ ఆనందిస్తున్నాను. అదిగో చూడండి. ఆ యేటిపై బోటు. అదే నా జీవనాధారం".

"ఓర్ని కుఱ్ఱ వెధవ్వైనా చుఱ్ఱుమనిపించావే ! ఒరేయ్ ! నీ పేరేమిట్రా?"

"మీరెలా పిల్చినా పలుకుతాను. ఎలాగూ 'ఒరేయ్' అన్నారుగా అదే పేరనుకోండి."

"ఓర్ని మొత్తానికి గడుసువాడివే ? సరేగాని పోదాం పద".

"ఎక్కడికి ?"

"అవతలి గట్టుకు"

"మీరెళ్ళండి నేను తర్వాత వస్తాను."

"నేను వెళ్ళలేననేగా రానంటున్నావు ? బోటు నడపడం వస్తే నేనే వెళ్ళే వాణ్ణి........ దాపోదాం. అంతగా అయితే నన్ను దాటించి నువ్వు మళ్ళీ వచ్చేద్దువు గానిలే"

"మరి మీరు వచ్చేప్పుడెలా వచ్చారు ?"

"బోటు మీంచే. కాని అరింటిదాకే వుంటానన్నాడు ఆ బోటువాడు. కబుర్లలో పడి టైం మరచాను. ఇప్పుడు ఆరున్నరైంది. నీకిక తప్పదు. రామరి."

"నేనున్నాను గాబట్టి సరిపోయింది. మరి నేలేకపోతే ఏంచేసే వారండి?"

"ఏమిటోరా అసలు ఆ సంగతే గుర్తుకు రాలేదు."

"సరే పదండి వెళ్దాం."

* * *

"ఒరేయ్ నీకు జ్యోతిష్యం గురించి తెలుసురా ?... పోనీ విన్నావా?"

"నాకేం తెలీదండీ అదేమిటో"

"ఓర్నీ అది తెలీపోతే నీ జన్మలో నాలుగో వంతు వృథా తెలుసా! అంత విలువైన శాస్త్రం అది"

"పోన్లెండి. ఏం చేస్తాం తెలీనప్పుడు ...... మీరు కాస్త ఇసింటారండి పడవ ఊపు పెరుగుతోంది ఎందుకనో ?"

"ఒరేయ్ పోనీ ఇంకోటి అడుగుతా చెప్పు. 'మీ మాంస' అని పేరు విన్నావురా కనీసం"

"మీ మాంసమో, నా మాంసమో అదేం నాకు తెలీదు"

"ఓర్నీ ! అది ఎంత విలువైనదో నీకేం తెలుసు. దాన్ని పట్టుకుని మాంసం అంటున్నావు పైగా. అదీ తెలీపోతే నీ జన్మలో సగం దండగ"

"అబ్బా అంత విలువైనదన్న మాట ! ఏం చేస్తాం తెలీనప్పుడు కానీండి ఆ ! మీరు పడవమధ్యలోకి రండి ఎందుకైనా మంచిది. ప్రవాహ వేగం పెరిగినట్లుంది".

"ఒరేయ్ నువ్వెప్పుడన్నా 'తర్కశాస్త్రం' అనే దన్నా విన్నావురా కనీసం?"

"లేదండి బాబూ ఎప్పుడూ విననన్నా లేదే ? అదేమిటో విచిత్రంగా వుందే విండానికే !"

ఎంత గొప్ప గ్రంథం. ఎంత గొప్ప గ్రంథం. నువ్వు దాన్ని గురించి విననైనా లేదంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. నిజంగా అదీ తెలీకపోతే నీ బ్రతుకు నాలిగింట మూడు పాళ్ళూ వృథానేరా ! ఆ ! ! జన్మ ఇచ్చినందుకు అలాంటి ఉద్గ్రంథాలు చదువుతుంటేనే ఏదైనా తరణోపాయం లభిస్తుంది".

"........... సరేగానీండి మీరు తొందరపడాలి. అవతల ఏరు మహావేగంతో సుళ్ళు తిరుగుతూ మాంచి వడిగా వస్తోంది. ప్రాణాలు దక్కాలంటే పడవలో వుంటే లాభం లేదు. మీకు ఈతవచ్చునా ?"

"అబ్బే రాదే" ఇంక వేరే తరణోపాయం లేదంటావా ?"

"లాభం లేదు. అదొక్కటే ఈ సమయంలో తరణోపాయం. మీరు చెప్పిన మూడు శాస్త్రాలు రాకపోయినా నా బ్రతుకు మూడు పాళ్ళేవృథా. కాని, ఈ ఒక్కటీ రాకపోతే మీ బ్రతుకు పూర్తిగా వృథానే.... అలా తత్తరపడి లాభం లేదు. నేనున్నాను. భయం లేదు దూకండి మరి నాతో పాటే మీరూనూ!".

## అనుబంధసూక్తులు

'ఎంత చదివితే దేవునికి దగ్గరౌతాము ?' అన్న దాని కంటె, చెయ్యవలసిన పనులు తెలిసి చెయ్యగలగడమే తరించడానికి మార్గం.



# హైటెక్ రామకోటి

"నమస్కారమండీ పంతులుగారూ ! ఎంతసేపైంది మీరొచ్చి ?"

"ఇప్పుడే ! పది నిమిషాలైంది. సరేగాని, ఏమిటీ – నన్ను రమ్మని కబురంపారట ... ఏమిటి విశేషం ... అబ్బాయి పెళ్లేమైనా కుదిరిందా ?"

"అబ్బే ! అబ్బాయి పెళ్లీకాదు, అమ్మాయి సీమంతమూ కాదు.. ఈ జాతకం ఒకసారి చూడండి"

"..... అవునూ ! రావుగారూ ! ఈ జాతకం మీది లాగే వుందే?"

"లాగే ఉందేమిటి ? నాదే ! ప్రస్తుత ఆర్థిక పరిస్థితి చూడండి. నేనే మన్నా కారు కొనగలనేమో చెప్పండి"

"మీ ఆర్థిక పరిస్థితికేమండీ వేరే జాతకం చూసి చెప్పాలా ? దివ్యంగా కళ్లకు కట్టినట్లు కనబడుతుంటేనూ!"

"అట్లా కాదు జాతకం చూసి చెప్పండి"

"నా మాట మీద మీకు నమ్మకం లేదు. సరే కానీండి ఏం చేస్తాం, చూసే చెప్తాను.

"... లాభాధిపతి, గృహవాహనాధిపతిగూడా అయిన శుక్రుని మహర్దశలో శుక్రుని అంతర్దశ నిన్ననే ప్రారంభమైంది. ఇంకా మూడు సంవత్సరాల నాలుగు నెలల దాకా ఢోకా లేదు. రెండో ఇల్లు, రెండో కారు కూడా కొనగలుగుతారు ... అయితే ఒక్క పని చేస్తే ఇంకా బాగా కలిసొస్తుంది"

"మీ సలహా నేను ఎప్పుడు పాటించలేదు ! అదేమిటో చెప్పండి"

"మీరు రామకోటి వ్రాయాలి. రామకోటి కనకవ్రాస్తే శుక్రుడిలో శుక్రుడు, తర్వాత శుక్రుడులో రవి, శుక్రుడులో చంద్రుడి అంతర్దశా కాలాలు గూడా ఆర్థికంగా బాగా కలిసివస్తాయి. మీరు ఎంత తొందరగా ప్రారంభించి ఎంత తొందరగా పూర్తి చేస్తే అంత మంచిది. ఎల్లుండి పునర్వసూ నక్షత్రం. ఇది రాముల వారి జన్మ నక్షత్రం గూడాను. మీ ఆర్ద్రా నక్షత్రానికి సంపత్తార అవుతుంది. ఆలస్యం చెయ్యకుండా ఎల్లుండే ప్రారంభించండి"

"అలాగే ! కాని నేను రామకోటి పూర్తి చెయ్యగలనంటారా ? ఉన్న వ్యాపారాల్లో పడి పెళ్లాం బిడ్డలతో మాట్లాడడానికే టైం దొరకడం లేదు. సరేలెండి.. ఏదో ఆలోచించి ఎలాగో అలా పూర్తయేట్లు చూస్తానులెండి"

* * *

"ఏరా సుబ్బారావ్ ! 8 గంటలైంది ఇంక అపుదామా మన పార్ట్ టైమ్ గుమాస్తా జాబ్."

"అవునూ, ఎవరెవరు ఎన్నెని వ్రాశారో చెప్పండి. రావు గారికి ఏ రోజు కారోజు ఎకౌంట్ అప్పచెప్పాలి. నేను పదివేలు వ్రాశాను. మీరెన్ని వ్రాశారో చెప్పండి."

"నేను పదివేలు"

"నేనూ పదివేలు"

"నేనూ పదివేలు"

'నువ్వురా వామన్రావ్?"

"నేను యాభైవేలు"

"అరె ! యాభైవేలు ఎలా వ్రాయగల్గావురా ! మా నలుగురికీ పదివేలు వ్రాయడానికే టైం బొటాబొటీగా సరిపోయిందే ?"

"నేనూ మీ లాగే పదివేలే వ్రాయగల్గాను. కాని, నాలుగు కార్బన్లు పెడితే ఒక్కొక్క కాగితానికి 1 + 4 = 5 కాపీలు వచ్చాయి. మొత్తం యాభై వేలు అయినట్లేగా ? పైగా ఎక్కువ వ్రాస్తే ప్రతిఫలం గూడా ఎక్కువ ముట్ట చెబుతానన్నాడుగా ?"

"ఓర్నీ తెలివిమండా ! మా బుఱ్ఱలకు ఈ ఐడియా తట్టలేదురా. "పొట్టివాడికి పుట్టెడు బుద్ధులన్నారు ఇందుకే కాబోలు. మీవాళ్లు నీకు సరిగ్గా సరిపోయే పేరే పెట్టార్రా!"

* * *

"ఏరా ఇవాళ ఎవరెవరు ఎన్నెన్ని వ్రాశారో ఎకౌంట్ చెప్పండి. నేను యాభై వేలు పూర్తి చేశాను. మీరూ చెప్పండి".

"నేను యాభైవేలు"

"నేనూ యాభైవేలే"

"నేనూ యాభై వేలే"

"వామన్రావ్ నువ్వెన్నిరా ?"

"రెండు లక్షలు"

"నిజమేనా ? మమ్మల్ని ఉడికించడానికి కోస్తున్నావా ?"

"నిజమేరా ! అక్షరాలా రెండు లక్షలు"

"కార్బన్లుపెట్టినా యాభైవేలకంటే ఎక్కువ రాలేదే, నువ్వెలా వ్రాశావురా?"

"ఒక స్టెన్సిల్ కట్ చేయించి డూప్లికేటింగ్ మిషనుకు ఎక్కించా. ఇప్పటికి రెండులక్షలదాకా లాగాను"

"ఓర్నీ తెలివితగలడా ! ఇలా అయితే ఐదుగురం పదిరోజుల్లోనే రామకోటి పూర్తి చెయ్యగలంగదరా ! భలేఐడియా వచ్చిందిరా నీకు"

"పదిరోజు లెందుకురా ? మా మామయ్య ఇంకో సలహా చెప్పాడు. ఆ సలహా పాటిస్తే రేపటికే ఇచ్చేయ్యవచ్చు గూడా !"

"ఏమిట్రా ఆ సూపర్ సలహా ?"

"మార్కెట్లోకి ఈ మధ్యనే మనబోటి గాళ్లను దృష్టిలో పెట్టుకుని ఆల్‌రెడీ కోటినామాలు ప్రింటైన పుస్తకాలు గూడా రిలీజ్ చేశారుట ! అదిచ్చేసి రావల్సిన డబ్బు రేపే తీసేసుకుంటే సరిపోతుంది గదా!"

"ఏడిశావులే వెధవా ... ఒరేయ్ వీడికి వీడిమేనమామ పోలికే వచ్చిందనుకున్నాం గానీ, వీడి కార్బన్‌కాపీ బుద్ధులక్కూడా మేనమామే ఒరిజినల్ అని ఇప్పుడు తెలిసిందిరా."

* * *

"ఏమైనా మనమీద ఆధారపడ్డందుకు అనుకున్న దాని కంటే ముందే రావుగార్కి రామకోటి నిన్ననే ఇచ్చేశాం. చాలా సంతోషంగా వుంది. ఇలాంటి

బేరాలు వదులుకోకూడదురా. ఇవాళ రమ్మన్నాడుగా. రండి వెళ్లి డబ్బు తెచ్చుకుందాం."

* * *

"ఓరేయ్ రావుగారు చాలా తెలివిగలవాడ్రా. మనమేమీ అడక్కుండానే, మనల్నేమీ అనకుండానే రామకోటి వ్రాయడంలో మనంపడ్డ కష్టానికి తగ్గట్టుగా - తగిన ప్రతిఫలాన్నే ముట్ట చెప్పాడు."

"ఏం రా అలా అంటున్నావ్!"

"చూడు నీకే తెలుస్తుంది.. ఇచ్చిన క్రొత్తనోట్లకట్టలో పైనా క్రిందా రెండే అసలైన నోట్లు మధ్యవన్నీ ఫోటోస్టాట్ కరెన్సీ నోట్లే !!"

"అవున్రోయ్"

"అవున్రోయ్ నాకూ అంతే"

"అవునవును నాకూ అంతే"

'నా కట్టలోనూ అంతేరా!"

"ఇలా ఇచ్చాడేమిటని అడగటానిక్కూడా ధైర్యం చాలడం లేదు, నోరు రావడం లేదురా మనం చేసిన పనికి"

"మన హైటెక్ రామకోటికి ఆయనిచ్చిన న్యూటెక్ రెమ్యూనరేషనేమోరా ఇది!"

"మరైతే ఇలాంటి హైటెక్ రామకోటికి ఆయనకు ఆ రాముడేమిస్తాడంటావ్?"

"ఏముందీ, ఒక టాయ్ హౌసూ, టాయ్ కారూ ఇచ్చి ప్రస్తుతానికి వీటితో ఎంజాయ్ చెయ్యమంటాడు. అంతేనంటారా ?"

"అట్లా అయినా నయమే ! వాటి కాగితం బొమ్మల్నివ్వకుండా ఉంటే చాలు పాపం."

## అనుబంధసూక్తులు

"చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా"

"కక్కుర్తి పడితే గంతకు తగిన బొంతలే జీవితంలో ఎదురౌతారు"

"మోక్షధర్మంలో - బాధ్యతల నుండి తప్పించుకోవడాలు, తన బాధ్యతలను ఇంకొకరికి బదలాయించడాలు పనికిరావు.

"నిష్కారణంగా భక్తి వుంటే - మనకు రావల్సిందేదన్నావుంటే వస్తుందేమోగాని, మనక్కావాల్సింది రావడం కోసం భక్తిని ప్రకటిస్తే రాదు".



# తాళ్ళ పాక అన్నమాచార్యులు

"జో అచ్యుతానంద జోజో ముకుందా!" అనే చరణం వినని తెలుగు వారు ఉండరు. ఊయలూపే తల్లికి బిడ్డకు గల సంబంధాన్ని ఆర్జించుకున్న ఈ కవిత్వం మన అన్నమయ్యది. ఇంటిపేరు తాళ్ళపాక. ఊరు కడప జిల్లా తాళ్ళపాక. చిన్నతనంలో కూడా తల్లిపాడిన కీర్తనలంటే ఇష్టపడేవాడు. పాఠాలంటే ఇష్టపడలేదు. ఈ విషయంలో తాతగారి పోలిక అంటారు, తాతగారు ఆ ఊళ్ళో కేశవస్వామి అనుగ్రహం పొంది సర్వజ్ఞుడై కీర్తనలు వ్రాశాడు.

మన అన్నమయ్య ఇంటి పనులు పొలం పనులు సక్రమంగా చేసుకునే వాడు. కొడవలితో గడ్డికోస్తూ గొంతెత్తి పాడిన వేళల ఎన్నివేల కీర్తనలు ఆకాశంలో అంతర్యామిత్వం పొందినాయో తెలియదు. ముప్పయి రెండువేల భక్తి సంకీర్తనలు మాత్రం లెక్కకు లిపిలోకి ఎక్కాయి. వేంకటేశ్వరుని అనుగ్రహంతో సంస్కృతంలో 'వేంకటాచల మాహాత్యం', 'సంకీర్తన లక్షణం' రచించాడు, తెనుగులో 'శృంగార మంజరి,' 'ద్విపద రామాయణం' రచించాడు. వర్ణనా శిల్పం, భావ గాంభీర్యం ఇతని రచనలోని విశేషాలు.

"కులుకు కుచ కుంభముల కొమ్మకును కుంభరాశి
వెలుగు హరి మధ్యకును సింహరాశి"

ఇలాగు ద్వాదశ రాశులు అలివేలుమంగ దేహంగా న్యాసం చేశాడు. రచనలో బహు శాస్త్ర పాండిత్యం కనిపిస్తుంది. కాని, దాని కన్న, భక్తి

ప్రాధాన్యం వహిస్తుంది. "అన్నమయ్యను పలకరిస్తే మనం పులకరిస్తాం" అని పురందరదాసు మెచ్చుకున్నాడు. ఇతని కీర్తనలలో గొబ్బిళ్ళ పాటలు, చందమామ పాటలు, తుమ్మెదపాటలు, శోభనపు పాటలు మొదలైన విధానాలన్నీ ఉన్నాయి. "చందమామ రావే జాబిల్లి రావే" ఇదీ అన్నమయ్య పాటే !

యుక్తవయస్సులో వివాహం ఆడి ముగ్గురు పిల్లల తండ్రిగా కూడా నిర్లిప్తుడుగా జీవించాడు. "తిరిప మెత్తినను తిరుపతి పోవలె" అని వెనుక చూపు లేకుండా కుటుంబంతో తిరుపతికి నడిచాడు. మోకాటి పర్వతం వద్ద శోషవచ్చింది. ఒక ముత్తైదువ ఉపచరించింది. ఆమె అలివేలు మంగ అని దర్శించాడు, తన వేంకటేశ్వర శతకంలో కూడా ఆమె విందును స్మరించాడు. విష్ణు యతీంద్రుల నాశ్రయించి వైష్ణవ దీక్ష స్వీకరించాడు. పుణ్యక్షేత్రాలు పాదయాత్ర చేశాడు. యాత్ర అంతా సంకీర్తన మయం. అహోబిలంలో నృసింహస్వామిని కవితా పుష్పాలతో పూజించాడు. ఇక్కడే సాళువ నరసింహరాయలతో పరిచయమైంది. రాయలకు గురువై ఆస్థానంలో మంచి చెడ్డలు చక్క చేశాడు. నరసింహరాయలు తన పరంగా చక్కని కవిత్వం చెప్పమని కోరాడు. "నరహరి కీర్తన నానిన జిహ్వా ఒరుల నుతింపగ నోపదు" అనే సమాధానంతో సంకెళ్ళు పడ్డాయి.

"సంకెల పెట్టిన వేళ, చంప బిలిచిన వేళ
అంకిలిగా అప్పుల వాళ్ళు ఆగినవేళ
వేంకటేశు నామమే విడిపించగతిగాక"

అనే సంకీర్తనతో సంకెళ్ళు తెగిపడ్డాయి. రాయలు పాదాలు పట్టుకొని అందలం ఎక్కించి మోశాడు.

అన్నమయ్య సంసారం సారవంతం. ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. అందరూ కవులే ! అందరూ వేంకటేశ్వర భక్తులే !! భార్య తిమ్మక్క మహా సంకీర్తనలు రచించింది. అల్లుడు, మనుమలు కూడా మహా భక్తులు, కవులూ అయ్యారు. ఇతని జీవిత చరిత్ర సమగ్రంగా దివ్యత్వంలో నిండి ఉంటుంది. తెలుగువాళ్ళు అతని కీర్తనలు నోరార పాడుకొని తరించాలి.



# అనంతామాత్యుడు

వాఙ్మయంలో ప్రతిబింబించిన నీతులు మహానుభావుల చిత్ర పటాల వంటివి. చిత్రపటాలు చూడటం కన్న మహానుభావుల్ని దర్శించడం ఎంత దుర్లభమో సజీవము లైన నీతులు వాఙ్మయము ద్వారా అందటం కూడా అంతే దుర్లభం అందించిన వారు ఆచరించినప్పుడే ఆ నీతులు సజీవ పాత్రలుగా మనకు నచ్చేట్లు ముచ్చట్లు చెప్తాయి. అలాంటి వాఙ్మయాన్ని సృష్టించిన మహానుభావులలో అనంతామాత్యుడొకడు. కనుకనే అతని పాత్రలు మనతో సంభాషించి మనకు కొంతైనా అంటే విధంగా నీతులను నేర్పుతాయి. వచనంలో చిన్నయసూరి ఎంత నీతిమంతుడో కార్యకర్తలలో అనంతామాత్యుడు అంత నీతిమంతుడు. ఇతడు వ్రాసిన కథలనే ఇతరులూ వ్రాశారు. కాని, ఇతని రచనలోని జన సంస్కరణశక్తి ఆ యితరుల పెక్కుమందిలో లేదు. వాళ్ళ నీతులు కేవలం ఘంటం చివరి నుండి రావటమే అందలి నిర్జీవత్వానికి కారణము.

అనంతామాత్యుడి కుటుంబమే మూర్తిమంతులైన నీతులు అనదగిన వ్యక్తులకు నిలయం. అనంతుని ముత్తాత బయ్యన ధర్మసంస్థాపకుడైన దండనాథుడు. సమగ్రాంధ్ర ధర్మమూర్తి అయిన తిక్కన గారి చేత "భవ్య భారతి" అని పిలిపించుకున్నాడు. బయ్యన పినతండ్రి గొప్ప తపస్వి. తన కుటుంబంలోని నరజన్మలతో పాటు తమ పెంపుడు పిల్లికి కూడ నరకం రాకూడదని పరమేశ్వరుని చేత మాట తీసుకున్నాడు. ఆ కొమ్మ చిగుటే

అనంతామాత్యుడు. ఇతడు గొప్ప భక్తుడు, కవి. అహోబల నృసింహస్వామి ఈతనికి సాక్షాత్కరించి అడిగి కావ్యాన్ని అంకితం పుచ్చుకొన్నాడు, అదే 'భోజరాజీయము.' చిన్న చిన్న కథలతో సజీవ పాత్రలతో ధర్మోపదేశం చేసే పవిత్ర గ్రంథం ఇది. ఇక కావ్యరచనా కౌశలం, పాత్ర సృష్టి, కథా సంవిధానము మొదలైన సాహిత్య ధర్మాలు వీరికి చిల్లర విషయాలు.

ఒక పులికి ఆహారంగా తన శరీర మర్పిస్తానని మాట యిచ్చిన గోవు - యింటికి పోయి దూడకు పాలిచ్చి, నీతులు నేర్పి, తిరిగి వచ్చి మాట నిలుపుకొని పులి మనస్సును కరిగించిన కథ తెలుగుదనం తెలిసిన ముసలమ్మకు కూడా తెలిసి వుంటుంది. అనంతుడు తీర్చి దిద్దిన ఈ కథ కథ కాదు. మన యెదుట జరుగుతున్నది. అనిపిస్తుంది.

త్రివేణీ సంగమంలో దేహత్యాగం చేస్తే కోరికలు వచ్చే జన్మలో నెరవేరుతాయి. భాగ్యవంతుడు భర్త కావలెనని ఒకామె, ఒక మహనీయుడైన కవి భర్త కావలెనని మరియొకతె, సుందరుడు భర్త కావలెనని మరియొకతె, తన భర్త రాజు కావలెనని మరి యొకతె కోరి త్రివేణీలో దేహ త్యాగం చేశారు. వారి కోరికలు విని ఒక బ్రాహ్మణుడు తానా నలుగురికి భర్త కావలెనని కోరి దేహ త్యాగం చేశాడు. అతడే 'భోజరాజు'గా జన్మించాడు. ఇలాంటి కథల గమ్మత్తులు ఈ కవికి మంచినీళ్ల ప్రాయం. అగస్త్యుణ్ణి నిత్యోపవాసిగా వశిష్ఠుణ్ణి సదాబ్రహ్మచారిగా తెలుగువాళ్ళు చెప్పుకునే కథ ఈ గ్రంథం లోదే !

ఆత్మానుభూతి రుచి చూచిన కవికి మానవు లెంతో జంతు జాలము గూడా అంతే ! ఎలుక బాల్యక్రీడలను, యవ్వనపు సొగసుల్ని వర్ణించగలిగిన

ఋషితుల్యుడైన కవి ఇతడు. వయస్సున ఎలుక దేహము నూగుదోసపిందె వలె, దాని యుదరము బూరుగ దూది వస్త్రము వలె, దాని కన్నులు అంటించిన చిన్న పూసలవలె, పలువరుస ఉచ్చింత పువ్వులోని కేసరముల వలె వర్ణించుట లోని సహజత్వము సర్వజీవులలో సంధానము పేర పరకాయ ప్రవేశము చేసినప్పుడే సాధ్యపడుతుంది.

అనంతుడు కావ్యరచన చేశాడని, ఛందశ్శాస్త్రం రాశాడనీ చెప్పటం పండితులకు గొప్పకావచ్చు. సర్వజీవులలలో గల దయామయమైన ప్రాణి ధర్మాన్ని, ప్రాణ ధర్మాన్ని దర్శించి అనుభవించి సంస్కారానికి అందించిన వాడొక్కడు మన జాతికి ఉన్నాడన్నది తెలుగువారి పెన్నిధి.



# కాశీనాథుని నాగేశ్వరరావు

కోసుగా వుండే గాంధీ టోపీతో, ప్రక్క గుండీలు గల కంటిమెడ లాల్చీతో మెడమీద సన్నగోరంచు కండువాతో, సద్గుణాల భారంతో వంగీ వంగని నడుంపై ఠీవిగా కుడిచెయ్యితో, ముందునడకను సూచించే కుచ్చెళ్ళు గల్గిన పంచెతో ఆంధ్రత్వం కొట్టవచ్చినట్లు కన్పడే శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా ఎలకుఱ్ఱు గ్రామంలో జన్మించారు. 1867 సంవత్సరంలో 1వ తేదీన జన్మించారు. మహా పురుషుల్ని ఎంతమందినో దివ్యలోకాల నుండి మన భారత దేశానికి అందించిన కాలం గత శతాబ్దపుటుత్తర భాగమే ! అప్పుడు పుట్టిన వారి శత జయంత్యుత్సవాలనే ఇప్పుడు మనం భక్తి శ్రద్ధలతో, వేడుకగా జరుపుకుంటున్నాం.

పంతులు గారి తండ్రి బుచ్చయ్య అయ్యవార్లం గారు పండితుడు. షట్కాల శివపూజా దురంధరుడు. ఆయన తన కొడుక్కి పెట్టిన పేరు 'నాగలింగం'. పంతులు గారు చదువు ప్రారంభించినది ఎలకుఱ్ఱు గ్రామంలోని నిడుమోలు కాంతయ్య గారి వీధిబడిలో. ఇంగ్లీషు చదువు తండ్రికి ఇష్టం లేదు. తల్లి ప్రోద్బలం వల్ల ఇంగ్లీషు చదివినా బి.ఎ. కూడా పూర్తి చేయలేదు. కాని సంస్కృతాంధ్రాల్లో మంచి ప్రావీణ్యం సంపాదించారు. పుట్టింది ఆరాధ్యులైన శైవుల ఇంటిలో – పారాయణ చేసింది భగవద్గీత. దీక్ష పుచ్చుకున్నది శ్రీ విద్య అయినా ఇష్టదైవం శ్రీరాముడు. వీటి అన్నిటి

సమన్వయమే ఆయన వ్యక్తిత్వం. ఆయన వ్యక్తిత్వంపై ప్రభావం చూపగలిగిన మరో ముగ్గురు మహనీయులున్నారు. యౌవన దశ ప్రారంభంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారూ, ఆయన వివేక వర్ధనీ; ప్రౌఢ దశలో శ్రీ బాల గంగాధర తిలక్, వారి కేసర పత్రిక; పరిపూర్ణ దశలో మహాత్మ గాంధీ, వారి జీవితమూ.

ఇప్పటిలాగే 1908 నాటికి గూడా సమస్త రంగాల్లోనూ ఆంధ్రులు వెనుకబడి ఉన్నారు. వంగీయులు, మహరాష్ట్రులూ, కొన్ని విషయాల్లో తమిళులూ కొంతనయం. వారి స్థితికైనా ఆంధ్రులను తీసికొని రావలెననే బాధ శ్రీ నాగేశ్వరులను వేధించింది. చాలా మంది కొన్ని రంగాల్లో మాత్రమే ఆంధ్రకు సేవచేశారు. కాని పంతులు గారు వారందరితో అన్ని రంగాల్లోనూ అగ్రశేణిలో వుండి కృషి చేశారు. అంతేకాదు. నాయకులలో అభిప్రాయ భేదాలు తీవ్రత దాల్చినపుడు నిదానంగా సద్దుబాటు చేసేవారు. 1930 సంవత్సరములో గాంధీజీ ఉప్పు సత్యాగ్రహోద్యమంలో ముందుకు దూకి నెల్లూరు జైల్లో 6 నెలలు ఉన్నారు. అప్పుడు జైల్లోని ఇతర ఖైదీల కందరికీ స్వంత ఖర్చులతో ఏ లోటు లేకుండా భోజనాదికాలు సమకూర్చేవారు. "ఆంధ్రరాష్ట్రం రావలె దానితో భారతదేశం బలపడవలె. భారతదేశానికి స్వాతంత్ర్యం రావలె. దానితో ప్రపంచం శాంతితో వర్ధిల్లవలె" ఎక్కువగా ఈ విషయాన్నే ఆయన ప్రసంగాల్లో చెప్పేవారు.

'అమృతాంజనము', 'ఆంధ్రపత్రిక', 'భారతి' – ఈ మూడు పేర్లు వినని ఆంధ్రుడుండడు. ఆంధ్రుల నరనరాల్లో జీర్ణించుకు పోయిన ఈ పేర్లు పంతులు గారి తపః ఫలితాలు. ఆయన ప్రతిభా పాటవ ప్రత్యక్ష

నిదర్శనాలు. 'ఈయన అమృతాంజనంతో దోచుకొనిన ధనమంతా దేశసేవకే వినియోగిస్తున్నారు. కాబట్టి, ఈయన హెచ్చుగా దోపిడీ చేయవలెననే కోరుతాను' అని వ్రాసారు గాంధీగారు ఒక వ్యాసంలో. నిజంగా 1899లో మొలకెత్తిన ఈ అమృతాంజనం దేశ దేశాంతరాలలో ఖ్యాతి గడించింది. నాగేశ్వరులు జీవితంలో అది పెద్ద మలుపు. అట్లాగే ఆంధ్ర పత్రిక. తెలుగు పత్రికా రచయితలకు కులపతి శ్రీ నాగేశ్వరులు, అది ప్రజావాహినికి ప్రతిబింబం. ఇప్పటికీ సంపాదకీయ నిగ్రహానికి, నిర్భయతకు, క్షుణ్ణమైన విషయ పరిశీలనకు పెట్టింది పేరు. జనాకర్షణ కోసం సందేహాస్పదమైన వార్తలను ప్రచురించి మర్నాడు క్షమాపణలు చెప్పుకునే కుయుక్తులు లేనటువంటిది. దీని తార్కాణం పంతులు గారి చేతులలో అది పెరగడమే! ఎన్నో నవలలను, వ్యాసాలను, ఆర్ష, అధునాతన రచనలో సాగే కవిత్వాలను ఎందరో మేధావులను ఈ ఆంధ్ర పత్రిక ద్వారా పరిచయం చేశారు. తామెన్నో వ్యాసాలు వ్రాసారు. ఆంధ్రపత్రిక ఆంధ్రులదైతే, భారతి యావద్భారతానిదీను. ఆరోజుల్లోనూ, ఇప్పటికీ భారతిలో రచన అచ్చు అయిందంటే పట్టాభిషేకమే! 'ఆంధ్రపత్రిక', 'భారతి' వారి స్వంత ముద్దుబిడ్డలు. 'విజ్ఞాన సర్వస్వము' వారి పెంపుడు ముద్దు బిడ్డ. ఈ మూడింటిలో ఆయన చేసిన సాహిత్య సేవ అద్వితీయము, అపూర్వము, అపారము.

పంతులు గారు ఇతరత్ర చేసిన సేవ ఒక ఎత్తు, దాతలుగా- అన్నదాతలుగా - దీనజనోద్ధరుణలుగా చేసిన సేవ ఒక ఎత్తుగాను భావించవలసి యుంటుంది. పంతులు గారి దగ్గర కాస్సేపు నిల్చుంటే తెలుస్తుంది ఆయన దాతృత్వం. శాలువాలు కప్పుకొని కొందరు, ఖద్దరు

టోపీలతో కొందరు, పుస్తకాలకై కొందరు, పుస్తెల డబ్బుకై కొందరు, కన్నీళ్ళతో కొందరు, విద్యాలయాలకని, సంతర్పణల కని, పెళ్ళిళ్ళకని, పుణ్యక్షేత్రాలకనీ, స్కూలు జీతాలకనీ – ఈ విధంగా మరి ఎందరో వారిని ఆశ్రయించి తమ అవసరాలు తీర్చుకునేవారు. ఆయన ఒక చేతికి తెలియకుండా మరో చేత్తో ఎన్ని గుప్తదానాలు చేశారో ! ఒకరన్నారు ఆయనతో. "మీరు అపాత్రులకు గూడా దానం చేస్తున్నారు. మీ దానాల్లో చాలా భాగం వ్యర్థం" అని. అందుకు పంతులు గారు ఇచ్చిన జవాబు – "చూడండి! మనము చేసే స్వల్ప సహాయానికే పాత్రుడెవరో, అపాత్రుడెవరో విచారణచేసి తేల్చుకునేలోపల పాత్రభూతుడైన ఆ పుణ్యాత్ముడు నిస్సహాయుడై ప్రాణాలు వదుల్తాడు".

'ఇన్ని చిల్లర దానాలు చేసే కంటే ఏదో ఒక దానినే చేస్తే శాశ్వతంగా ఉంటుంది గదా!' అని ఒకరు సూచించగా అందుకు పంతులు గారు – "అదేమో కాని, పెద్ద దానాలు చేయవద్దని కాదు. లక్షల పెద్ద దానాల కంటె ఈ చిన్నవే బీదల కందుతాయి, ఎక్కువ బాధా నివారణ కూడాను. నాకిదే సంతోషం' అన్నారు. నిజంగా ప్రపంచ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించవలసిన మాటలివి. మరొకసారి ఉన్నవ లక్ష్మీనారాయణ గారితో – "ఎంత మందో బాధపడుతూంటే అవి నివారించక దేనికో లక్షలు ఇయ్యటం నా కంత నచ్చదు" అన్నారు. పుట్టింది నిరుపేద కుటుంబంలోనే. మామూలు వాళ్ళైతే ఆ దారిద్ర్య బాధకు క్రుంగిపోతారు. కాని, ఆయన సహన శీలత 'విశ్వదాత'ను చేయగల్గింది. తాను పడ్డ దారిద్ర్య బాధ ఇతరులు పడకూడదని ఆయన ఆకాంక్ష. అందుకే దీనజనోద్ధరణ విషయంలో ముమ్మారుల గాంధీ

నాలుగు దూలాల ఇళ్ళు తమ స్వంత ఖర్చులతో నలభై కట్టించి హరిజనులకు ఉచితంగా ఇచ్చారు. వారికై తమ తల్లిగారి పేర 'శ్యామలాంబా పాఠశాల'ను కట్టించి ప్రప్రథమంగా హరిజనులకు ప్రవేశం కల్పించారు. ఎంత మంది హరిజన విద్యార్థులకో ద్రవ్య సహాయం చేశారు. హరిజన వసతి గృహాలు, గ్రంథాలయాలను ఏర్పరిచారు. వారి అస్పృశ్యతా నివారణోద్యమం కేవలం ఆదర్శాశయాలతో గాక ఆచరణానుష్ఠాల ద్వారా కొనసాగింది.

మొత్తము మీద పంతులు గారు చేసినంత సర్వతోముఖమైన సేవను ఇంతవరకు ఎవ్వరూ చేసినట్టు తోచదు. అందులోనూ – అంతా స్వయం కృషి చేతనూ, స్వసహాయం తోనే ! ద్రవ్యాన్ని ఆర్జించి, ప్రజోపయోగం కోసం దీనజనోద్ధరణ కోసం ఆ ధనాన్ని విరాళంగా ఇచ్చి వేశారు. అందుకే ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 'కళా ప్రపూర్ణ' బిరుదిచ్చినా ఆంధ్ర ప్రజల హృదయాల్లో నిలిచిన బిరుదు "దేశోద్ధారక" యే !

# వేములవాడ భీమకవి

అన్నమాట జరగటం, వస్తువుల స్వభావాన్ని, రూపాన్ని దర్శన స్పర్శనాదుల చేత మార్చటం, గాలిలో నుండి వస్తువులు సృష్టించి తీయటం మొదలైన సిద్ధులు గలవాళ్ళు అన్ని శతాబ్దాలలోను ఉంటూనే ఉంటారు. ఆ సిద్ధుల కోసం కొందరు మంత్రాలు జపించటం, కొందరు జపహోమాదులు చేయటం, మరి కొందరు జంతుబలి మొదలైన నీచకృత్యాలకు పాల్పడటం మొదలుగా సతమతమౌతూ ఉంటారు. వాళ్ళకెవళ్ళకు ఈ సిద్ధులు లొంగినట్లు ఇంతవరకు నిదర్శనం లేదు. యథార్థం తెలుసుకుంటే ఈ సిద్ధులు ఒక్కొక్కరికి పుట్టుకతో వస్తాయి. అవివారిస్వభావంలో భాగంగా పనిచేస్తూ ఉంటాయి. కొన్ని ప్రయోజనాలు జరుగవలసినప్పుడు ప్రకృతి ఇలాంటి వ్యక్తులను కల్పిస్తుంది. అంతకన్న వేరే తాపత్రయ పడవలసినది గాని, అసూయ పడవలసినది గాని ఏమీ లేదు.

ఇలాంటి ఆ జన్మ సిద్ధులు కలవారిలో – వేముల వాడ భీమ కవి ఒక మహనీయుడు. అతని జన్మమే సిద్ధితో ప్రారంభమైనది. వితంతువైన అతని తల్లికి దక్షారామ భీమేశ్వరుడు స్వప్నములో కనిపించి ఆలింగనం చేసుకొని తన అంశతో ఒక కుమారుడు జన్మిస్తాడని చెప్పాడు. వెంటనే ఆమె గర్భము ధరించగా భీమన్న పుట్టాడు. నిష్ఠాపరులు నలుగురు సహజంగా ఆమెను దుయ్యబట్టి తల్లీ కొడుకులను బహిష్కరించి, తమ శీల పవిత్రతను మరొక మారు స్థాపించుకొన్నారు. ఈ బెడద ఆ తల్లికి, కొడుకునకు మనసు కెక్కలేదు. వారి కెక్కిన దల్లా భీమేశ్వరుడొక్కడే !

ఒక ధనవంతుని యింట వివాహ సమయంలో అందరికీ భోజనాలు వడ్డించారు. నలుగురూ రావటం చూచి, బాలుడైన భీమన్న కూడా వచ్చాడు. పదిమందీ అతనిని ఆగ్రహంతో బయటికి తరిమారు, బాల్యముతో బాటు ఉద్రేక స్వభావముతోడైన భీమన్న కోపంతో అరిచాడు. "మీ అన్నము సున్నము - మీ అప్పాలన్నీ కప్పలు" వెంటనే విస్తళ్ళలో అన్నము సున్నమైంది. అప్పాలు కప్పలై ఎగరడం ప్రారంభించాయి. కొందరు దీనిని నమ్మకపోయినందువల్ల నష్టము లేదు. కళ్ళ యెదుటనే ఇలాంటివి చేస్తూ ఉన్న సిద్ధులను గూడా దూషించి ఈర్ష్య పడేవారి కేకల వలన లాభం గాని, నష్టం గాని ఏనాడూ లేదు.

భీమన్న పెద్దవాడై భీమకవి యని ప్రఖ్యాతి వహించాడు. పరమేశ్వర దత్తమైన ఆశుధారా కవిత్వము లోకము మీదికి ప్రవహించింది. నిగ్రహాను గ్రహ సమర్థమైన ఆయన వాక్కును కవితాకళ యలంకరించింది. శ్రీనాథుడంతవాడు గూడా "వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండ లీల నొక్కొక్క మాటు" అని వేడుక పడిన కవితా ధోరణి భీమన్నది. ఈ కవి క్రీస్తు శకము 1175 ప్రాంతము వాడని కొందరూహించారు. తన్ను గూర్చి ఈ సిద్ధుడు చెప్పుకొన్న పద్యమొక్కటే లభించింది. అందు తాను వేముల వాడ వంశమువాడని, భీమేశ్వరుని నందనుడని, సిద్ధులు ప్రకటించిన వాడని కావ్యధుర్యుడని, కళింగాధీశుని సమకాలికుడని, ప్రభు మన్ననలు పొందినవాడని తెలుస్తున్నది.

"ఘనుడన్, వేములవాడ వంశజుడ దక్షారామ భీమేశనం
దనుడన్, దివ్య విషామృత ప్రకట నానా కావ్యధుర్యుండ, భీ
మన నా పేరు నెరుంగ జెప్పితి కళింగాధీశ ! కస్తూరికా
ఘనసారాది సుగంధ వస్తువులు వేగన్ దెచ్చి లాలింపవే"!

ఇందలి కళింగాధీశ అన్నదానికి తెలంగాధీశ అనే పాఠాంతరము తెచ్చి, ఏదిమూలమో తెలియకుండా సాధించారు లిటిగేషను పండితులు. ఈ ప్రభువు తెలంగాధీశుడైతే కూడా ఎవ్వడో, ఎప్పటి వాడో తెలియదు. మరొక పద్యమున కళింగ గంగు అను ప్రభువు వర్ణింపబడటంవల్ల ఈ రెండింటిని జతపరచి భీమకవి 11-12 శతాబ్దముల ప్రాంతము వాడని మాత్రము చెప్పవచ్చును. రచనలోని భాష నన్నయ తర్వాతి భాషను తెలియ జేస్తుంది.

ఈ కవి శాపానుగ్రహ సమర్థతకు నిదర్శనమైన సన్నివేశం మరొకటి ఉంది. కళింగ గంగు కొలువులోనికి రాకుండా కవీశ్వరులు వచ్చారని భీమకవి కబురు పెట్టాడు. పేరు కనుక్కోమని రాజు కబురంపాండు. జవాబుగా ఈ పద్యము వ్రాసి పంపాడు.

"శాపానుగ్రహ వటువును
రాపాడెడి కవుల నెత్తిఅంపంబనగా
భూపాల సభల పూజ్యుడ
నా పేరది భీమనంద్రు నరవర ! వింటే !"

కొంచెము అహంకారము పాలు గలిసిన పద్యము విని, ప్రభువు "ఇది సమయం కాదు తరువాత మమ్ము కనిపించుకొను" మని తిరిగి కబురు చేశాడు. వెంటనే భీమన ఈ పద్యము వ్రాసి పంపి వెళ్ళిపోయాడు.

"వేములవాడు భీమకవి వేగమె రాగ కళింగ గంగు తా
సామము మాని, వేము తిని సందడి తీరిన వెన్నరమ్మనెన్
మోమిట జూప దోషమిక ముప్పది రెండు దినమ్ములావలన్
జామున కర్థమందతని సంపద శత్రుల జేరుగావుతన్."

అక్షరాలా అన్నంతా జరిగింది. దిక్కులేక మారువేషంలో, చీకటిలో, తిరుగుతూ, దీనస్థితిలో మరల కవిగారి కెదురు పడ్డాడు ప్రభువు. భీమకవి తెలుసుకొని, జాలిపడ్డాడు. మరల ఆశీర్వదించాడు. మీన మాసమున పూర్ణిమ బోయిన షష్ఠి నాటికి మరల రాజ్యం లభిస్తుందని దీవించి, పగటి వేషగాళ్ల సంఘంలో కలిసి, అంతవరకు చరించమని సలహా ఇచ్చాడు. జయించిన క్రొత్త రాజుగారు ఆ వేషగాండ్ల పార్టీ చేత తన విజయ ఘట్టము నాటకము పెట్టించాడు. కళింగ గంగుపై రాజభక్తి గల యుద్ధవీరులు కుట్రచేసి, ఆ రాత్రి వేషములు కట్టారు. గుఱ్ఱము లెక్కి ఆయుధాలతో నాటకం వేశారు. కళింగ గంగు తన వేషము తానే ధరించాడు. దృశ్యము మధ్యలో నాటకము చూస్తూ కూర్చున్న శత్రురాజు తల నరకటంలో భీమకవి ఆశీస్సు ఫలించింది. భీమకవిని పిలిపించి పూజించాడు కళింగ గంగు. అప్పుడు సభలో తన వాక్కును గురించి భీమకవి యిలా సెలవిచ్చాడు.

"రామునమోఘ బాణమును, రాజశిఖామణి కంటిమంటయున్,
తామరచూలి వ్రాతయును, తారక విద్విష ఘోరశక్తియున్,
భీముగదా విజృంభణ, ముపేంద్రుని చక్రము, వజ్రి వజ్రమున్
వేముల వాడ భీమకవివీరుని తిట్టును రిత్తబోవునే" !

అటుపైన చాలా కాలం భీమకవి అతని ఆస్థానంలో అనేక వినోదాలు చేసినట్లు కథలు, కొన్నిపద్యాలు ఉన్నాయి.

అయితే ఈ కవి వ్రాసిన గ్రంథాలేమైనట్లు ? 'రాఘవ పాండీయమ'ను ద్వ్యర్థి కావ్యం రచించినట్లు పింగళి సూరన తన రాఘవ పాండవీయ పీఠికలో పేర్కొన్నాడు. భారతానువాదం చేసినట్లు జనశ్రుతి ఉంది. కొన్ని పద్యాలు గూడ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు సాధించి ప్రకటించారు. కాని గ్రంథం మాత్రం లభించడం లేదు. ముఖ్యంగా ఆశుకవిత్వం ఎక్కువ చెప్పి ఉంటాడని ఊహించవచ్చును. మహానుభావుల సాన్నిధ్యాన్ని వినోదించినంతగా విశ్వాసము చూపించుట నేర్చుకొనని తెలుగు జాతి ఇతని పద్యాలను వ్రాసుకొనుటకు సోమరితనం వహించి యుండవచ్చును. ఇలాంటి లోపాలను తట్టుకొని నిలచిన ఈ మహాసిద్ధుని వ్యక్తిత్వం శతాబ్దాల తెరపై ప్రధాన పాత్ర వహించిందని అంగీకరించి తీరవలసినదే !



# బ్రహ్మనాయుడు

తెలుగుజాతిలోకాక మరి ఎచ్చట పుట్టినను విశ్వ మహాపురుషులై యుండెడి ప్రేమమూర్తులు మన జాతిలో పలువురు ఉద్భవించారు. వారిలో బ్రహ్మనాయుడు మణిపూస. భగవంతుడు ప్రేమ స్వరూపుడని నిరూపించుటకు భూమికి దిగివచ్చిన అవతార మూర్తులలో నితడొకడు. బుద్ధుడు, క్రీస్తు అవతార మూర్తులైనచో బ్రహ్మనాయుడుగూడా అవతారమూర్తియే ! ఆ యవతారమునకు పేరు ప్రఖ్యాతులు ఎంత కలిగినవి అను అంశము ఆ జాతి సమర్థతపై ఆధారపడి యున్నది. రాగోద్వేగములు, ద్వేషోద్రేకములు, అంటని ప్రేమమూర్తులకు మమతా బంధము కాని, ప్రతీకార సంకల్పము గాని యుండవు. అయినను వారిని దుర్బలులుగా అర్థము చేసికొనరాదు. ధర్మచ్యుతి నెదుర్కొనుటకు వారుతప్ప నితరులు సమర్థులు కారు. మౌనము నందు జ్ఞానము, దాక్షిణ్యము నలవరచుకొనిన శక్తి, ఆచరణతో కూడిన ఆదర్శములు వీరి లక్షణములు.

గుంటూరు మండలమున పలనాడున్నది. ఆనాడు అనుగురాజు పలనాటి ప్రభువు. అతని అమాత్యుడు దొడ్డమనీడు. ఆయన ద్వితీయ పుత్రుడుగా బ్రహ్మన్న యవతరించెను. పిన్నవయస్సునుండి బుద్ధిబలము, రాజ్య తంత్రము, యుద్ధ విద్య ఇతనికి వెన్నతో వచ్చినవి. నిర్మల విష్ణుభక్తి ఇతనిని విష్ణు అంశ సంభూతడని నిరూపించినది. ఔదార్యము, సహృదయత, నీతి .కౌశలము, ప్రశాంతచిత్తత కలిగి, వలసినపుడు ప్రళయరుద్రుడుగా ప్రకాశించెను. అనుగురాజు తన యవసాన కాలమున బ్రహ్మన్నను

అమాత్యునిగా నియమించి తన కుమారులకు రక్షకుడుగా కూడ బాధ్యత నప్పజెప్పెను.

పరమత ద్వేషము లేని సంఘ సంస్కరణము బ్రహ్మన్నతోనే వైష్ణవము నందు అవతరించెను. ప్రజలకు వసుధైక కుటుంబ స్వరూపము నిరూపించెను. అది తన యింటనే యారంభమైనది. 'కన్నమ దాస'ను హరిజన బాలకుని తన పుత్రునిగా స్వీకరించెను. అతడును ప్రత్యేకమైన హక్కులు కోరక బ్రహ్మన్న పుత్రునిగా వెలుగొందెను. అతనికి గురువు ఇష్టదైవము తండ్రి. మాచెర్లలో చెన్న కేశవస్వామి ఆలయమును ప్రతిష్ఠ చేసి, ప్రథమముగా హరిజన ప్రవేశము చేయించి, 'చాపకూడు' అను పేర స్వామి ప్రసాదము పంక్తి భోజనములు పెట్టించిన వాడు బ్రహ్మన్న. ఐతాంబ అనుకూలవతియైన అర్థాంగియై అవతార నిర్వహణము చేయగా వారికి బాలచంద్రుడు పుత్రుడై జన్మించెను. ఇతడు 10వ ఏటనే గుఱ్ఱపు స్వారి, కత్తి – కర్రసాములు చేసి కాకలు తీరిన బాలసూర్యుడు. ఇతని వలన వంశము, రాజ్యము నాశన మగునని యొక జ్యోతిష్కునిచే నాగమ్మ కుట్ర చేసి చెప్పించెను. ఐనచో బాలుని వధింపుడని బ్రహ్మన్న యాజ్ఞాపించెను. తన వారి కన్న తన రక్షణలోని వారు ముఖ్యులు. బాలచంద్రుడు తప్పించుకొని పినతండ్రి ఇంట రహస్యముగా పెరిగెను.

పలనాటి యుద్ధము తెలుగు నాటి భారత కథ. అందలి మాయా జూదమే ఇందలి కోడి పందెము. అప్పుడు శకుని ఇపుడు నాగమ్మ. నాడు ధర్మరాజు నేడు బ్రహ్మనాయుడు. కోడి పందెమున నాగమ్మ మోసము బయటపడినను మాటకు కట్టుబడి బ్రహ్మన్న పరివారము మాచెర్ల విడిచి

కృష్ణానది దాటి ఏడేండ్లు ప్రవాస జీవితము గడిపిరి. అప్పుడుకూడ-గురజాలను, మాచర్లను కలిపి నాగమ్మ పరిపాలించినను ప్రజలను సుఖపెట్టిన చాలుననియే బ్రహ్మన్న మనస్సున ఆవేదన పడెను. నాటి ఘోషయాత్ర వలె నాగమ్మ వలసపోయిన బ్రహ్మన్న పరివారముపై మండాదిలో దుండగము చేయించినది. బ్రహ్మన్న కోపింపక నివాసము మాచెర్లకు మార్చి మరి యొక చెన్నకేశవాలయమును నిర్మించెను. ఏడేండ్ల ప్రవాసానంతరము అలరాజును రాయబారము పంపగా అల్లుడని ఎంచక విష ప్రయోగమున చంపిరి. మామయగు నలగామరాజు నాగమ్మ కుతంత్రమున వె!ర్రి నాగమ్మ. దాని నాత్మహత్యగా నిరూపింప జూచినపుడు గూడ బ్రహ్మన్న నాగమ్మపై కోపించలేదు. అయిన వారి మధ్య యుద్ధము తప్పనిసరియని తెలిసినపుడు మాత్రమే నాగమ్మను గూర్చి బ్రహ్మన్న యాగ్రహము పొందెను. జంతుబలిని గూడ మోటు జనులచే మాన్పించిన బ్రహ్మన్న తెనుగు యువకుల రక్తపాతమునకు కారణమైన నాగమ్మపై నాగ్రహించుట యతడు ధర్మమూర్తి యని నిరూపించును.

ఇక యుద్ధము తప్పనప్పుడు బ్రహ్మనాయడు చేసిన విజృంభణమున శత్రువులకు ఎల్లెడల బ్రహ్మనాయుని విశ్వరూప సందర్శనమే జరిగెను. యుద్ధమున కన్నమదాసు మరణముతో బ్రహ్మనాయుడు అస్త్ర సన్యాసము చేసి వైరాగ్యమూర్తియై నిలిచెను. ఆ మూర్తిని చూచి నంతనే ఇరు పక్షములలో మిగిలిన వారి చేతులలోని ఆయుధములు పట్టు దప్పి నేల వ్రాలినవి, అందరును స్తంభించిరి. పొరపాటు తెలిసిన ఎదుట పక్షము వారు ఉపేక్షింపగా నాగమ్మ, నలగాములు బంధితులైరి. బ్రహ్మనాయుని పాదములపై వ్రాలిరి.

నాగమ్మ తనకుట్రను తననోటనే వివరించి, విభజనలేని పలనాటి రాజ్యమునకు బ్రహ్మన్ననే రక్షకుడుగా ప్రార్థించినది. శాంతి వెన్నెలలు బ్రహ్మన్న పెదవుల నుండి మందస్మితముగా వెలువడెను.

(ఈ వ్యాసము సరళ గ్రాంథిక భాషలో వ్రాయడమైనది).



# వేమన

మనోభావాన్ని మనోహరంగా వ్యక్తపరచగలగటం మంచి కవుల లక్షణం. మఱ్ఱి చెట్టుని మఱ్ఱి గింజలో ఇమిడ్చినట్లు తక్కువ మాటలలో చదువరుల హృదయాలలో క్రమ వికాసంగా విప్పారేటట్లు ఒక దర్శనాన్ని నాటడం ద్రష్టలైన కవులకు వెన్నతో పెట్టిన విద్యగా ఉంటుంది. దీనికి నిదర్శనంగా వేమన జన్మించాడు. వామనమైన ఆటవెలది మూడు పాదాలలో భావానికి త్రివిక్రమత్వం దర్శనమిచ్చిన వాడు వేమన. ఇతడు చదువుకున్నవాడు కాదు. చదువున్న వాడు. "చదువులలో మర్మము" అతని హృదయ ధర్మము.

"ఊరు కొండవీడు, ఉనికి పశ్చిమ వీధి, మూగ చింత పల్లి మొదటి యిల్లు" అని మూడుముక్కలు తననుగూర్చి చెప్పుకున్నాడు. ఇతడు చంద్రగిరి సమీపంలో మూగచింతపల్లి వాడని కొందరూ, కొండవీటి వాడని కొందరూ స్థలాభిమానాలుపోయిన విమర్శకులకు ఇతనివాక్యాలుపదేశ మంది అనుష్ఠానం చేసుకునే టైము (సమయం) లేకపోయింది. ఇతడు తెలుగు వాడని యావదాంధ్రులూ గర్వించవచ్చు, ఆ సంకోచ భావము ఉంటే, ఇతని వాక్కులను ఆంగ్లమున కనువదించుకొని యానందించిన వారితనిలో విశ్వస్రష్టను దర్శించారు. 1650-1670 ప్రాంతం వాడని చాలా మంది అంగీకరించారు.

భోగి కాలేని వాడు యోగి కాలేడు. యోగి ప్రపంచాన్ని అంటనీయడు గాని ప్రపంచం నుండి దూరంగా పారిపోడు అన్న సత్యాలు ఇతని జీవితం

వలన నిదర్శమయినాయి. కూర, నేయి లేకుండా ముద్ద యెత్తని వేమన "నేయి లేని తిండి నీయాన కసవది, కూరలేని తిండి కుక్క తిండి" అని ఒకస న్నాడు. "తల్లిగర్భమందు తాబుట్టినప్పుడు, మొదట లేదు మరియు తుదను లేదు, నడుమ బట్ట కట్ట నగుబాటు కాదొకో" అని ఒకనాడు సెలవిచ్చాడు. ఒకనాడు శరీరం సర్వ సుఖాలూ అనుభవించింది. ఏనాడూ ఆత్మ దిగంబరంగానే తిరిగింది. ఇదీ వేమన జీవిత కథకు సారాంశం !

ధర్మం, గృహస్థ ధర్మం తనలో నుండి యీ వాక్కులుగా వెలువడింది!

"ఇల్లు విడిచి పెట్టి యిల్లాలి విడనాడి
వేశ్య తగులు వాడు వెట్టివాడు
పంట చేను విడిచి పరిగ తీరిన యట్లు !"

ఇతడు బంగారం చేసే వాడని భ్రాంతి పడటానికి పనికి వచ్చిన వాక్యాలు ఇతని కొంటె తనాన్ని ప్రకటన చేస్తాయి.

"ఇహము సుఖము గూర్చు హోమ కారక విద్య
పరము సుఖము నిచ్చు బ్రహ్మ విద్య
కడమ విద్య లెల్ల కల్ల విద్య లెగదా !"

"ఉప్పు చింతపండు ఊరిలో నుండగా
కరవదేల వచ్చె కాపులార
తాళకంబెరుగరో తగరంబు నెరుగరో !"

అన్నింటినీ మించిన బంగారం నిరంతరానందం. అది పొందిన వానికి బంగారమెందుకని తోచదు గదా ! "పదవులందు, పాడి

మొదవులందు, ఆశలుడిగినట్టి అయ్యలు ధన్యులు" అనే వాక్యాలు కనిపించవీ విమర్శకులకు, ఎవడి దృష్టి వాడిది ! ఏం చేస్తాం !

ఇక వేమన మకుటం. "విశ్వదాభిరామ వినురవేమ!" అనేవాక్యాలకు అర్థాలు తీయటంలో ఈ విమర్శకుల దృష్టి రాతికి పీచు తీసింది. 'విశ్వద' అను వేశ్యను వేమనకు అంటకట్టారు. 'అభిరామయ్య' అనే బంగారపు శిష్యుణ్ణి అప్పజెప్పారు. "చింతామణిర్జయతి" అని కృష్ణ కర్ణామృతం ప్రారంభించిన లీలాశుకునికి కూడా ఇలాగే మూడింది !

ఇతని రచన కవిత్వము కాదని కొందరి అభిప్రాయం. వారికి కవిత్వంపై గల దృష్టికి జాలిపడవలసి ఉంటుంది. ఒక సత్యాన్ని కాంతా సమ్మితంగా చెప్పటమే కవిత్వ మైతే వేదకవులు, రామాయణ భారత కర్తలైన ఋషులూ సంస్కృతంలో ఎంతో – వేమన తెనుగులో అంతే !

"పసుల వన్నె వేరు పాలెల్ల నొక తీరు
పుష్ప జాతి వేరు పూజ యొకటి
దర్శనంబు లారు దైవంబదొక్కటి"

మొదలైన వాక్యాలు దీనికి నిదర్శనాలు. తత్త్వ దర్శనము, సత్య దర్శనము, లోకదర్శనము, భూత దయ, సహజ వైరాగ్యము, సంకల్పబలము, సాహసము, సహనము కలిసి వేమన మూర్తి అని అతని వాక్కులు ఎక్కడ పట్టి చూచినా తెలుస్తుంది. నిజమైన ఆస్తిక్యం, అనుభూతి ఒకటే. దాని పేర చెల్లుబాటయ్యే మూఢాచారాలు, అవిశ్వాసాలు, అనాచారాలు, దురాచారాలు, పాషండత్వాలు, వేమన పలుకు కత్తితో హాస్యమనే పూతతో

తెలియకుండా తేలినవి ! ఇతని హాస్యము ఇతని భావసంపదలో ఒక భాగమే గాని లాక్షణికులు చెప్పే హాస్యరసం మాత్రం గాదు. సంస్కృత శ్లోకాలలో బూతు మాట్లాడి హాస్యరసానికి ఉదాహరణ లిచ్చామనుకొన్న లాక్షణికులకు అందదు వేమన హాస్య రహస్యం. ఆ జన్మ సిద్ధులకు సహజానందముద్రగా వాక్కు నుండి వ్యక్తమవుతూ ఉంటుంది నిజమైన హాస్యము. అందులో గూడా ఉపదేశముద్రయే ఉంటుంది గాని వెకిలితనము, దుస్సంస్కారము ఉండదు. పాల సముద్రంలో పవళించిన విష్ణువు గోపికల యిండ్లలో పాలను దొంగిలించటం మొదలైన చమత్కృతులను సవరించిన తావులలో భగవంతుని గూర్చి నరుడు ఎలా అర్థం చేసుకుంటాడో – అలా చేసి కోవడంలో అతని అచ్చట్లూ, ముచ్చటలూ, అసంపూర్ణతలు ఎలా ప్రతిబింబిస్తాయో, వాటిని జూచి తప్పు పట్టకుండా ఎలా సరదా పడవచ్చోచూడటం కనిపిస్తుంది.

తెలుగుకాక మిగిలినదంతాకలిసి వేమన విశ్వకవి శ్రేణివాడు. ఛందస్సుకాక మిగిలినదంతా కలసి వేదము, ఉపనిషత్తు, గీత. ఇతని పుట్టుకతో తెనుగు జాతి శాశ్వతంగా ధన్యమైంది.



# శివదేవయ్య

నరజన్మ ఎత్తడమే దుర్లభమైన విషయం. ఆ జన్మలో కమనీయమైన కవిత్వ మల్లగల్గడం మహారాజుల కొలువులలో మంత్రిత్వాన్ని కొనసాగించ గలగటం, మంచితనానికి మరో పేరైన మానవత్వాన్ని ఆమరణాంతం కలిగి యుండటం - కేవలం ఏ కొంతమంది సత్పురుషులలో మాత్రమే పరిమిత మౌతుంది. వీటన్నిటితో పాటు దైవత్వం గూడా మూర్తీ భవించగల్గట మనేది అవతార లక్షణమే తప్ప మరొకటి కాదు. మనుష్యుల చేత ఆరాధింపబడటం అందులోను మహారాజు ఆజ్ఞతో మహారాణి చేత గూడా పూజలందుకున్న మహానుభావుడు శివదేవయ్య క్రీ.శ. 1400లకు పూర్వం వాడు.

శివదేవయ్య సార్థక నామధేయుడు. శివపూజలో రాణిగారి నైవేద్యాన్ని పరోక్షంగావుండే స్వీకరించాడు. శివరాత్రిపూట రాజుగారితో పాటు ఉపవాసంవుండిగూడా ఈ నైవేద్యం తాలూకు త్రేన్పురావడంతో ప్రక్కనే వున్న ప్రతాపరుద్రుడు అసలు సంగతిని, అటుపైన శివదేవయ్యను పూర్తిగా అర్థం చేసుకున్నాడు. అట్లాంటి శివదేవయ్యను కవిబ్రహ్మ తిక్కన సోమయాజి "ఈతడీశ్వరుడుగాని మానవమాత్రుండుగాడ"న్నాడంటే అందులో అతిశయోక్తికి తావులేదన్నమాటే గదా !

ఇతని "పురుషార్థ సారం" ఒక్కటి చాలు - అతని బహువిధ జ్ఞాన సముపార్జనా పటిమకు ప్రబల నిదర్శనంగా. వాస్తవానికి ఆయన వ్రాసిన పుస్తకాల్లో లభ్యమైనది. ఈ పురుషార్థ సారం ఒకటి, మరొకటి

# చిలకమర్తి లక్ష్మీనరసింహం

పందొమ్మిదవ శతాబ్దపు టుత్తర భాగంలో భారతదేశంలో పుట్టినంత మంది మహానుభావులు మరేకాలంలోను పుట్టలేదంటే అతిశయోక్తి కాదు. తెలుగు గడ్డ పై పుట్టినవారే చాలా మంది వున్నారు. సంగీత, సాహిత్య, నృత్యనటనాది లలిత కళలలో ఆరితేరినవారు, దేశ భక్తులు, సారస్వత వేత్తలు, వాచాస్వతంత్రులు, సనాతన ధర్మపరాయణులు, సంఘ సంస్కర్తలు పుట్టిన కాలం అదే! సరిగా, ఆకాలం లోనే ప్రభవ సంవత్సర భాద్రపద బహుళ చతర్దశి అంటే సరిగా 1867 సెప్టెంబరు 26వ తేదీన ప్రభవించిన పవిత్ర ప్రతిభామూర్తి మన చిలకమర్తి . బ్రహ్మసూత్రభాష్యమును ఆంధ్రీకరించి, పెక్కు కావ్యాలకు వ్యాఖ్యానాలు వ్రాసిన పురాణపండ మల్లయ్య శాస్త్రి గారు చిలకమర్తి మేనమామ. మాతామహులు భద్రయ్యశాస్త్రిగారు నిష్ఠాగరిష్ఠులు, సంస్కృత విద్వాంసులు. అటువంటి సంప్రదాయముగల వాతా వరణములో పెరిగిన పంతులు గారి వ్యక్తిత్వము చిన్న నాటనే క్రొత్త మలపులు త్రొక్కింది. ప్రియమిత్రుడైన ఒక మంగలి కుఱ్ఱవానికి గాయత్రీ మంత్రాన్ని గురించి చెప్పటంతో గురువు వద్ద సంధ్యావందన పాఠానికి ఉద్వాసనం జరిగింది. ఒక్క గణితంలో తప్ప మిగిలిన వానిలో మంచి చురుకుదనం గల్గిన నరసింహంగారు 1887 లో మెట్రిక్యులేషను ఉత్తీర్ణులయ్యారు. ఆయన ఏక సంథాగ్రాహి. ఒక్కసారి విన్న ఏవిషయమైనా, పాఠమైనా, బుర్రలో వుండి పోవాల్సిందే!

వంగపండితుడు శివనాథశాస్త్రి గారు 'బ్రహ్మసమాజం' అను విషయమై చేసిన ప్రసంగము, చెప్పుచేతలకు వ్యత్యాసము లేని వీరేశలింగంగారి ప్రబోధప్రసంగ పాఠములు చిలకమర్తిలో సంస్కరణాభిలాషను చిగురింపజేశాయి. బసవరాజు గవర్రాజుగారు పోయిన సందర్భములో కర్మకాండ జరుపుటకు ఏపురోహితుడు ముందుకు రానపుడు వీరేశలింగంగారే శవంతో వెళ్ళి పుస్తకం చూచి మంత్రాలు చదివి కర్మకాండను పూర్తి చేసిన సన్ని వేశం చిలకమర్తి చిత్తంలో చెదరని ముద్ర వేసింది, సంఘ సంస్కరణాభిలాషను దృఢతరం చేసింది. నిరాక్షేపణీయమైన ఋజుప్రవర్తనా శీలములు పంతులు గార్కి పెట్టని సొమ్ములు, కట్టని కోటలు. 'మీ శీలంలో నాకుకొన్ని లోపాలు కన్పడ్డాయి. మీ హితాభిలాషినిగాబట్టి మీరు మారాలని కోరుకుంటున్నాను' అనిపోలవరం జమిందారుగారితో నిర్మొహమాటంగా చెప్పి అటుపైన ఆయన స్నేహానికే స్వస్తి చెప్పిన ఋజుగామి. భోగము మేళములకు, వేశ్యలపాట కచ్చేరీలకు, నాట్యములకు వెళ్ళనని కందుకూరి వారికిచ్చిన వాగ్దానాన్ని ఆమరణాంతం నిలబెట్టుకున్న సత్యనిష్ఠాపరుడు.

సంస్కరణమనేది చిన్నతనం నుండే కలగాలనే ముఖ్యోద్దేశంతో చిన్న పిల్లలకు 1899 సంవత్సరంలో హిందూలోయరు సెకండరీ పాఠశాల నెలకొల్పారు. దానిక్కావలసిన కుర్చీలు బల్లలకూ అయ్యేసొమ్మునంతా ఆయనే భరించి ఆ నిర్వహణలో ఇబ్బందులన్నీ ఓపికతో సహించారు. మరియు 1909 సంవత్సరంలో రామమోహన పాఠశాలను నెలకొల్పారు. పదిమందితో ప్రారంభమైన ఈ పాఠశాల నూటయాభైమంది విద్యార్థులతో సమర్థవంతంగా

చిలకమర్తి వారి ఒక ప్రహసనంలో -

"ఒక నియోగి పంతులుకు తల్లి తిథి ఎప్పుడో తెలియదు. తద్దినాలు గుర్తు చెయ్యడం తప్ప మరొక పనిలేని పురోహితుడు గుర్తు చేస్తాడు. పంతులు భోక్తల్ని పిలుచుకు రమ్మని వెట్టివాణ్ణి పంపిస్తాడు. పురోహితుడికి మెళ్ళో యజ్ఞోపవీతం ఉండదు. అది ఉంపుడు కత్తె ఇంట్లో చిలక్కొయ్యకు తగిలించి మరచిపోయాడు. ఈనాడు స్త్రీ తిథి, స్త్రీలకు యజ్ఞోపవీతాలుండవు కాబట్టి భోక్తలక్కూడా ఉండనక్కర లేదంటాడు.

'అద్భుత శ్రాద్ధ'మనే మరో ప్రహసనంలో, కాకులు పిండాన్ని ముట్టుకోవు. అప్పుడు పురోహితుడు ప్రేతకు ఉప్మాతో పిండాలు, కాఫీతో తిలోదకాలు ఇప్పిస్తాడు. అవి ప్రేత కోరిందంటాడు. ఏం లేదు. ఆ రెండు లేందే తనకు గడవదు అందుకు,

'శవవాహ' మనే మరోదాంట్లో కిరాయి వాహకులు బేరాలాడి 'మరోసారి తగ్గిస్తా' మంటారు.

వృద్ధవరునికి కన్యాదానంచేస్తుండగా మూర్ఛపోతాడు వరుడు. వధువును వంటవాడికి అప్పగిస్తారు.

'జనాభా' నాటకంలో ఎన్యూమరేటర్ ఒకామెను భర్త పేరేమంటాడు. ఏదోఒకటి వ్రాసుకొమ్మంటుందా యిల్లాలు.

"విచిత్ర గోదానం" అనే దాంట్లో ఒక గ్రామకరణం చావసిద్ధమైన గోవును దానం ఇచ్చి, అది చావగానే - దాన్ని అవతలకు లాగించేందుకు గాను ఆబ్రాహ్మడి దగ్గరే రూపాయి వసూలు చేస్తాడు.

"నారద విలాపం" లో నారదుడు నిజానికి తానొక్కడే కలహభోక్తనని, కానీ ఇప్పుడు ప్రతి ఊళ్ళోనూ తన వంటివారు బయలు దేరడంతో తన ఆకలి తీరే దారి కనబడటం లేదని బాధ పడ్డాడు.

ఇలా ఎన్నో ప్రహసనాల్లో ఎన్నో రకాలుగా కరణాల యుక్తి ప్రయుక్తిల్ని, వరశుల్క, కన్యాశుల్కాల్ని; మిథ్యా గౌరవం గురించి ప్రాకులాడే వారిని; లంచం, త్రాగుడు, వ్యభిచారం, ఇంకా సంఘంలో ఉన్న కుళ్ళునంతా తూర్పార బెట్టారు. ప్రహసన రూపక ప్రయోజనాన్ని చక్కగా సాధించారు.

1942 వ సంవత్సరములో రాజమండ్రి విడిచి అత్తవారి ఊరు కాకర పల్లు చేరారు. ఆ సమయంలోనే ఆంధ్ర విశ్వ విద్యాలయము వారు ఆయన్ని 'కళాప్రపూర్ణ' బిరుదుతో సత్కరించారు. 1945 వ సంవత్సరంలో పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ చిట్టచివరగా చెప్పిన పద్యం ఇది.

**మ. తొలుంగన్నులు చూడలేవుగద విద్యుత్కోటి భాస్వత్ప్రభా**
**జాలాతీత గుణప్రపూర్ణ ఘన తేజోరాశి నీ మూర్తినిన్**
**నాలో గన్నయనం గనుంగొనునటన్నన్ జ్ఞాన నేత్రంబు లే**
**నే లే, దేగతి గన్గొనెద తండ్రీ! సత్కృపాంభోనిధీ!**

ఆయన అంధుడే! కాని తన మేధా దీప్తి తో రచనా కిరణములతో దేశమందలుముకొన్న గాఢాంధకారాన్ని తొలగించి, జ్యోత్స్నాజాలంలో ముంచెత్తిన ప్రజ్ఞాప్రభాకరులు సుధాకరమూర్తి. మచ్చుకైనా మాలిన్యం లేని మహామనీషి.



# టంగుటూరి ప్రకాశం

ఒంగోలు తాలుకా కనపర్తి గ్రామంలో 1872 సంవత్సరం మే నెలలో మేనమామల యింట్లో టంగుటూరి ప్రకాశం జన్మించాడు. వల్లూరు వెంకటప్పయ్య వీధి బడిలో విద్యాభ్యాసం. చిన్నప్పటి నుండి మాట పడేవాడు కాదు. మొగమాటం లేదు. ఎవరైనా అనవసరంగా తనజోలికి వస్తే వాళ్ళ పుస్తకాలు చింపిపారేసేవాడు. సాహసికుల విద్యార్థుల జట్టుకి నాయకుడిగా సాముగరిడీలు నేర్చి కుస్తీ పట్లలో ఆరితేరాడు. అప్పుడప్పుడు అల్లరి చిల్లరి వ్యవహారములు కూడ ఉండేవి. బడిలో లెక్కల పంతులుగారు బోర్డు మీద వ్రాసేలోపున వారిగోచీ కుర్చీకి బంధించే వాడు.

పేదరికంలో పెరిగి పెద్దవాడయ్యాడు ప్రకాశం. ఆయన తల్లి హోటలు పెట్టి కొడుకును చదివించింది. మూడు రూపాయల పరీక్ష ఫీజు కోసం 25 మైళ్ళు ప్రయాణం చేసి లేదనిపించుకొని తిరిగి వచ్చాడు. తల్లి తన పట్టు బట్ట తాకట్టు పెట్టి పరీక్ష ఫీజు కట్టింది. మెట్రిక్యులేషన్ పాసై సబ్ రిజిస్ట్రారు ఆఫీసులో ఉద్యోగానికి వెళ్లాడు. "పరీక్ష చేయకుండా నన్ను మెట్రిక్యులేషన్ ప్యాసు చేశారా ? మళ్ళా నీ పరీక్ష నాకు అక్కర లేదు. నీ ఉద్యోగమూ అక్కర లేదు" అని జవాబు వ్రాసి పంపాడు. ఆరాటం లేని పోరాటం, ఆయాసంలేని ఆవేశం ప్రకాశం గారి లక్షణాలు. మనస్సుకి, వయస్సుకి తలవంచని వాడు ఆయన.

సైమన్ కమీషన్ సందర్భంలో తుపాకీ ధరించిన ఖాకీబట్టల అధికారి "కాలు కదిపితే కాల్చేస్తాను" అని తుపాకీ చూపాడు. వెంటనే ప్రకాశం

"గుండె ఉంటే కాల్చు" అని చొక్కా గుండీలు విప్పి రెండడుగులు. ముందుకు వేశాడు. ఇన్‌స్పెక్టరు చేతిలో తుపాకీ జారిపోయింది. ఆరు సంవత్సరాల నాడు 60 సంవత్సరాల నాడు ఒకేరకమైన వైఖరి.

30 సంవత్సరాల లోపున రాజమండ్రి మునిసిపల్ ఛైర్మన్ అయ్యారు. అప్పటికి అతిరథ మహారథులైన ప్లీడర్లు అసూయతో ప్రకాశం పేరు గెజిట్‌లో పడకుండా చూశారు. వెంటనే శాసన సభ్యుని దగ్గరకు సూటిగా వెళ్ళి ప్రశ్నించాడు ప్రకాశం. "మీకు రాజమండ్రిలో యిల్లు లేదు. అందుకని నీ పేరు గెజిట్ లో వెయ్యరు." అనిసాకు చెప్పాడు శాసన సభ్యుడు. "సబ్‌కలెక్టర్లు, కాలేజీ ప్రొఫెసర్లు, ఛైర్మన్లుగా అవుతున్నారు గదా ? వాళ్ళు ఇళ్ళు నెత్తి మీద మోసుకుని వస్తున్నారా ?" అని నిలదీశాడు ప్రకాశం. తెల్లదొర ఉత్తరువులు పంపాడు. ఆనాడు తెల్ల వాళ్ళంటే దొరలు అని చాలా మంది బానిస భారతీయుల అభిప్రాయము . ఒక తెల్లదొర న్యాయమూర్తిగా ఉండేవాడు. విచారణకు ముందే నిర్ణయాలతో హాజరయ్యేవాడు. అనుకూలమైతే కునుకు కూడా తీసేవాడు. న్యాయసింహాసనము పైన ఒకనాడు "మేమెక్కడున్నాం ?" అని ఆయన ప్రశ్నించగా ' మనకే తెలియదు, గుర్తులేదు' అని ప్రకాశం ప్లీడరుగా కోర్టులోనే సమాధాన మిచ్చాడు. మరొక సందర్భములో నిద్రాముద్రితుడై లేచిన న్యాయమూర్తి "నీ వాదన మరొక్కమారు వివరించిచెప్పు" అని ప్రకాశాన్ని కోరాడు. "ఒకసారి వాదించి నందుకు మాపార్టీ వేయి రూపాయలిస్తారు. మరొక్కసారి చెబితే మరొక వెయ్యి అవుతుంది" అని సమాధాన మిచ్చాడు ప్రకాశం.

ఒకమారు గాంధీ మహాత్ముడు చిన్న రాజకీయ చిక్కుల వలన ప్రకాశాన్ని పిలిచి "మీరు పెద్ద వారైనారు రిటైర్ కావటం మంచిది" అని సలప ఇచ్చారు. "ముందు మీరు రిటైర్ కావాలి. మూడు సంవత్సరాల తర్వాత నేను రిటైర్ అవుతాను" అన్నారు. కారణం అడిగారు గాంధీజీ " మీ కన్న నేను మూడు సంవత్సరాలు చిన్న వాడిని " అని జవాబిచ్చారు ప్రకాశం. ఒక మారు ఒక డిస్ట్రిక్ట్ మున్సిఫ్ ఇలా అన్నారు, "రాజమండ్రిలో రెండు రూపాయలకొక ప్లీడరు వస్తాడు. కరువులేదు" వెంటనే జవాబిచ్చాడు ప్రకాశం "అలాంటి వాళ్ళు డిస్ట్రిక్ట్ మున్సిఫ్ అవటం వలన మాబోటి ప్లీడర్లకు తలవంపులుగా ఉంది", లంచం తో వలపన్నే వారికి ప్రకాశం చేతిలో అవమానం తప్పలేదు, ఆయన కేంద్ర శాసన సభకు ఎన్నిక అయిన సందర్భంలో మరికొందరు సభ్యులు టీపార్టీ ఏర్పాటు చేసి ఫోనులో పిలిచారు. ఆయన 'షటప్' అని ఫోను దించాడు. తరువాత వారు ఆయనను నిలదీసి అడిగారు, ఆయన ఇలా సమాధాన మిచ్చారు. "ఫోను కాబట్టి దెబ్బ దానికి తగిలింది లేక పోతే మీకు తగిలి ఉండేది. ప్రజలిచ్చిన సొమ్మును సొంత ఖర్చుకి వాడు కొంటున్నాడని ఆయన మీద గాంధీ గారికి ఫిర్యాదు చేశారు గిట్టని వారు. గాంధీజీ నిలదీసి అడిగారు. అప్పుడు ఆయనిచ్చిన సమాధానమిది. "నా ఆస్తి, ప్రాక్టీసు ప్రజలకు అర్పించాను. నాఖర్చులు ప్రజలు ఇవ్వకపోతే బిర్లాలు, టాటాలు, సబర్మతీ ఆశ్రమాలు యిస్తాయా ?" మరి సమాధానం లేదు.

పట్టుదల, కార్యదీక్ష, ఆత్మవిశ్వాసం వలన సాధించలేనిది లేదని ఆయన నమ్మకం. ప్లీడరుగా ఉన్నపుడు తనయందు అగౌరవంగా ప్రవర్తించిన

ఒక ఆడజడ్జీచేత మద్రాసు కోర్టులో క్షమాపణ చెప్పించాడు. పెద్ద ప్రాక్టీసులో న్యాయవాద వృత్తి నుండి విరమించి స్వాతంత్ర్య సమరంలోనికి దూకి 'స్వరాజ్య' పత్రిక నడుపుతూ గాంధీ మహాత్ముని సిద్ధాంతాలను త్రికరణ శుద్ధిగా ప్రచారంచేశాడు.

అనాడు నాయకులు ప్రజాసేవకే విలువ యిచ్చారు గాని పదవుల కోసం ప్రాకులాడ లేదు. అలాంటి వారిలో ఆణిముత్యం లాంటివాడు ఆంధ్రకేసరి. పదవులవలలో చిక్కుకొనకుండా ప్రజల హృదయంలో ప్రతిష్టించుకున్నారు తన కీర్తి గౌరవాలను. కనుకనే అనాటి యావద్భారత స్వాతంత్ర్య సమరవీరులకు ప్రకాశం అంటే ప్రత్యేకమైన గౌరవస్థానం. ఈనాటికీ ఆయన స్మరణ స్వేచ్ఛా స్వచ్ఛతకు ఒక చిహ్నం.



## విన్నపము

సులభ వచనములో మా సంస్థ ప్రచురించు ఆధ్యాత్మిక, ఆర్ష విజ్ఞానమునకు సంబంధించిన గ్రంథములన్నియూ వ్యాపార దృష్టితో కాక, సనాతన ధర్మ ప్రచార ధ్యేయముతోనే ముద్రింపబడినవి. ఈ గ్రంథముల అమ్మకమువలన వచ్చు సొమ్ము మరల మరికొన్ని ఆధ్యాత్మిక గ్రంథముల ముద్రణకు వినియోగింపబడును.

ఈ విధమైన ప్రచురణా యజ్ఞమునకు తామునూ సహకరించవలెనను కోరికగల సహృదయులు ఈ క్రింద తెలిపిన మా చిరునామాకు తమ అభిప్రాయమును వ్రాసి సంప్రదించవచ్చును.

ఇట్లు


**జగద్గురు పీఠము**

H/o. డా. జి. ఎల్. ఎన్. శాస్త్రి

5-10-4, 2/9, బ్రాడీపేట, గుంటూరు - 532 002

ఫోన్ : 233995

## సులభ వచనములో రచింపబడిన ఆధ్యాత్మిక గ్రంథములు

## రచన : డా.జి.ఎల్.ఎన్. శాస్త్రి

| | | |
|---|---|---|
| 1. | శాంతిపాఠములు | 5/- |
| 2. | గాయత్రి | 10/- |
| 3. | ప్రేయరు | 5/- |
| 4. | జాతక చక్రమును గుణించు పద్ధతి | 35/- |
| 5. | తైత్తిరీయోపనిషత్తు (శాస్త్రీయ వివరణ) | 70/- |
| 6. | పాదుకా పట్టాభిషేకము | 20/- |
| 7. | శ్రీమద్రామాయణము - అరణ్యకాండ | 55/- |
| 8. | శ్రీమద్రామాయణము - కిష్కింధాకాండ | 55/- |
| 9. | శ్రీమద్రామాయణము - సుందరకాండ | 60/- |
| 10. | రామో విగ్రహవాన్ ధర్మః | 10/- |
| 11. | శ్రుతిగీత - 1 | 4/- |
| 12. | శ్రుతిగీత - 2 | 8/- |
| 13. | లీలామాధవమ్ | 9/- |
| 14. | అక్షర గణపతి - కుండలినీపతి | 6/- |
| 15. | శ్రీ లలితా సహస్రనామ వివరణము (ప్రథమ భాగం) | 80/- |
| 16. | శ్రీ లలితా సహస్రనామ వివరణము (ద్వితీయ భాగం) | 80/- |
| 17. | శ్రీ లలితా సహస్రనామ వివరణము (తృతీయ భాగం) | 80/- |
| 18. | శ్రీ లలితా సహస్రనామ వివరణము (చతుర్థ భాగం) | 80/- |
| 19. | శ్రీ లలితా పూజా విధానము (ఖడ్గమాలాది స్తోత్రాలతో) | 13/- |
| 20. | Akshara Ganapathi - Kundalini pathi | 30/- |
| 21. | సౌందర్యలహరి | 120/- |
| 22. | కథాసూక్తులు - సుధామూర్తులు | 25/- |
| | మొత్తం | 870/- |

**మొత్తం సెట్టుకొన్నవారికి డిస్కౌంటు సౌకర్యము కలదు.**

శివారాధన, శివానందలహరి మొదలగు పుస్తకములు ముద్రణ కావలసియున్నవి. పై పుస్తకములు కావలసిన వారు గాని, ముద్రణకు సహకరించదలచిన వారు గాని సంప్రదించవలసిన చిరునామా

**జగద్గురు పీఠము, 5-10-4, 2/9, బ్రాడీపేట, గుంటూరు, ఫోన్: 233995**